శ్రీ

# బృహన్నల నాటకము.

లేక

# (ఉత్తర గోగ్రహణము.)

(ఇది భారతములోని పాండవులు యజ్ఞాతవత్సరము గడిపినకథ.)

**5 అంకముల ఆంధ్ర నాటకము.**

ఇది

బళ్లారిలోనుండిన డిస్ట్రిక్టు కోర్టువకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన


## ధర్మవరము - రామకృష్ణమాచార్యులచేత


రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులువల్ల ప్రకటింపబడియె.

మొదటి కూర్పు.


చెన్నపురి:

యస్. మూర్తి అన్డ్ కంపెనీవారి

కపాలి ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1915




[క్రయము రూ. 1-0-0.]




**Bellary, D. KRISHNAMA CHARLU,**

**ANDHRA NATAKA PITHAMAHA,**

*Born 1853—Died 1912.*

శ్రీ

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

## తత్ప్రవేశస్థలములు.




పురుషులు.

ఇంద్రుడు—అం I రం 1; 2,

అగ్ని—వరుణులు (దిక్పాలకులు) అం I రం 1.

చిత్రసేనుడు—(గంధర్వుడు) అం I రం 1.

అర్జునుడు—(కథానాయకుడు) అం I రం 1, 2, అం II రం 2 అం V రం 2, 3, 4. (శాపమువలన గలిగిన పేరు, బృహన్నల-అం II రం 3, అం III రం 2, 3, 4. అం IV రం 4, 6. అం V రం 1.

ధర్మరాజు—అం II రం 2, (వేషాంతరమున) కంకభట్టు 3, అం IV రం 4, 5. అం V రం 3, 4.

భీముడు—అం II రం 2 (వేషాంతరమున) వలలుడు 3, అం III రం 4 అం IV రం 4, 5. అం V రం 3, 4.

నకులుడు—
సహదేవుడు— } అం II రం 2, (వేషాంతరమున) దామగ్రంథి తంత్రిపాలుడు అం IV రం 4, 5 అం V 3, 4.

దుర్యోధనుడు—అం II రం 1, 4. అం IV రం 1 అం V రం 1.

కర్ణుడు—అం II రం 1, 4. అం IV రం 1. అం V రం 1.

దుశ్శాసనుఁడు—అం II రం 1.

హాలాయుఘాసురుఁడు—(బకాసురుని తమ్ముఁడు) అం II రం 1, 2, 4. అం IV రం 1.

విరాటుఁడు—(మత్స్యపురిరాజు) అం II రం 3, అం V రం 4.

ఉత్తరుఁడు—(మత్స్యపురియువరాజు) అం IV రం 3, 6. అం V రం 1, 2, 4.

కీచకుఁడు—(విరాటుని బావమరిది) అం III రం 2, 3, 4.

కృష్ణుడు—అం IV రం 2.

అభిమన్యుఁడు—(అర్జునపుత్త్రుఁడు) అం IV రం 2, 3, 5 అం V రం 1, 2, 3, 4.

భీష్మ—
ద్రోణ—
కృప—
అశ్వత్థామ—
} అం V రం 1.

సునందుఁడు—(గంధర్వుఁడు) అం III రం 1, 3, 4.

## స్త్రీలు.

ఊర్వశి—(అప్సరస) అం I రం 1, 2, అం III రం 1, 3, 4.

ద్రౌపతి—అం III రం 4.

ఉత్తర—(విరాటునిపుత్త్రి) అం IV రం 3, 6. అం V రం 2, 4.

నిలా—(ఉత్తరసఖి) అం IV రం 3, 6.

శ్రీ

హయగ్రీవాయనమః

# బృహన్నలా నాటకము.

## ప్రస్తావన.

శా॥ శ్రీవిఖ్యాతుఁడు పాండవేయుల మహార్తింబాపియెవ్వాఁడుమో।
దావిర్భూతి బృహన్నలాదులను గష్టాజ్ఞాత సంవత్సరం।
బేవిభ్రాంతియు లేకయుండఁదగ మాయించెఁ గృపాపూర్ణుఁడా।
దేవుండీవుతభక్తసంతతులకున్ దీర్ఘాయురారోగ్యముల్ ॥

ప్రథమాఙ్కము-ప్రథమరంగము.

[ప్రవేశము-ఇంద్రుఁడు-అర్జునుఁడు (ఏకాసనముపైన) అగ్ని-వరుణుఁడు-చిత్రసేనుఁడు-ఊర్వశి]

ఊర్వశి—(ఊర్వశినాట్యగానమైన పిదప)

(అనుబంధము 1.)

ఇంద్ర—ఊర్వశీ! నాట్యముచాలింపుము-విశ్రమింపుము-తనయా! అర్జునా! కాలకే యని వాతకవచుల వధించిన యాయాసమైనను దీరదు-మఱునాఁడు పోయెదుగాని లెమ్ము.

ఇంద్ర—నీయిష్టము-నీవాయసురుల వధించిన కాలమందు నీకొసంగిన యీకిరీటము నీకేయిచ్చెదను. ఇది నీవు ధరించుకొన సంగరమున నజేయుఁడవగుదువు-(అని ధరింపఁజేయును.)

చిత్ర—దేవేంద్రా! నామిత్రుఁడీ కిరీటమున నెంతో వెలుఁ గొందుచున్నాఁడు. ఇందు లమణీ సంతానముల సహస్రఫణాసమవధారి తాయుతమణీ విరాజచ్ఛేషాహివలె నున్నాఁడు.

ఇంద్ర—చిత్రసేనా! నిక్కమాడితివి.

అగ్ని—పురుహూతా! కవ్వడికీ కిరీటమొసంగుట నితని, నీవనవరతము రక్షించుట సూచింపుచున్నది. దీనియందలి తేజోమయములగు మణులు భవదాయత సహస్రాక్ష సూచకములై యిందు భవదవతారము బోలెనలరారు.

ఇంద్ర—అగ్నీ! నీవన్నమాట మఱియు మేలు.

వరుణ—దేవనాథా! ఈకిరీటమునందలి మణిదీప్తులు దీనినంతయు నావరించి యుండుట కిరీటనామమహామండలి మణి ప్రభాప్రతాపలక్ష్మిచే నీమహనీయుఁడా వరింపఁ బోవుట సూచించు.

ఇంద్ర—వరుణా! నీయుక్తియింకను లెస్స.

ఊర్వశి—(స్వగతము) మదన సామ్రాజ్య పట్టాభిషేకము గన్న యీయతిలోక సుందరుని భద్రకిరీటమని నే నెంతును.

అర్జు—మహామహులారా! నన్నింతయేల పెద్దచేసెదరు. మీ మహితోపకారఫలము శిరసానహించి యిట్లనుభవించి కృతకృత్యుఁడనై మీకు మ్రొక్కులిడుచందమునఁ గదా ధరించెదను.

క॥ మీయుపకారము నీగతిఁ।
బాయకశిరసావహించు భంగిఁజెలంగన్
ధీయుతులార ధరించెద
నీయుత్తమ మకుటరాజ మింపుదలిర్పన్ ॥

ఇంద్ర—అర్జునా! ఈశంఖమును నీకొసఁగెద-యిదిదేవదత్త నామంబునఁ బరఁగుఁగాఁతె (ఇచ్చును.)

అర్జు—మహాభాగ్యము.

క॥ అమరేశకిరీటమునకు ।
నమరఁగశంఖంబునిచ్చుటారసిచూడన్ ।
కుముదారికిందు దోడుగఁ ।
గమలారి నొసంగు భంగికమనీయముగన్ ॥

ఇంద్ర—ఇంక వేళైనది అర్జునా ! అయినరేపు పోయివత్తువా ? నీగృహంబునకు వచ్చినిను మరలఁజూతును.

క॥ తనయాముల్లోకములను ।
ఘనుఁడనగా నెందునీడుగల్గఁడనంగా ।
దినకరతేజము మెఱయఁగ ।
మనుమా యనుమానమింకమానుము మదిలోన్ ॥

చిరాయుష్మంతుఁడవై కీర్తివంతుఁడవై మనుము.

(నిష్క్రమింతురు.)



# బృహన్నలా నాటకము.

## ప్రథమాజ్కాము-ద్వితీయరంగము.

[ అర్జుని నిల్లు-ప్రవేశము-అర్జునుఁడు ]

అర్జు—ఆహా! ఈసురపురిని విడిచిపోవ నాకుమనసేపుట్టదు. చిత్రసేనుఁడు నాకు సంతతసఖుఁడై ప్రియమాచరించు చుండును. మా జనకుఁడు దేవేంద్రుఁడు ప్రేమడియొంతోఁజేసెదు. ఆప్రేమవలననే అయినను అగ్రజాదులఁదలఁచుకొన్న నిక్కడ కాలు నిలువదు. వారరణ్యవాసఖిన్నులై యూరటకానకుందురు.

[ ప్ర॥ ఊర్వశి. ]

అర్జు—అమ్మా! విచ్చేయుముఁ (నమస్కరించును)

ఊర్వ—అయ్యో! అయ్యో! ఇటుతగునా? నేను దేవవేశ్యను. వేశ్యలకు నమస్కరించు వారుందురా?

అర్జు—అమ్మా! నీతల్లివావియెందుపోవును.

ఊర్వ—ఆమాటనకుము. నీకభ్యుదయముకాదు.

అర్జు—ఏమమ్మా! వచ్చియుంటివి.

ఊర్వ—ఊరకమ్మా యనకుము. నేనొకఘనకార్యము నపేక్షించి నీయుద్ద కేతెంచితిని కూర్చుండుము.

అర్జు—ఎట్టికార్యముకాని చేయఁదగినదేని-చేయఁజాలుదు నేని చేయుదును. (మంచము పైకూర్చుండును.)

ఊర్వ—వచనమిచ్చినఁజెప్పుదును.

ఊర్వ—చేయఁదగినది-మిగులఁదగినది

అర్జు—నేను చేయఁజాలుదు నేని!

ఊర్వ—అందునకు సందేహములేదు.

అర్జు—అయిన నవశ్యము చేయుదు. నానతిమ్ము.

ఊర్వ—రాజకుమారా! ఊరక చుట్టుమాటలేల. నేను దేవవేశ్యను. అర్హులైనా చే మెచ్చుపడినవారి యేలెదను. నే నెవరికి భీతిల్లవలయు. నీ వీదేవపురికి వచ్చినది మొదలు నీపై నాకు మోహము. నీ చింత నామనసునఁ బాయదయ్యె. ఎన్ని దినములకు ముందో నేడపేక్షించు భంగినీ యాశ్లేష సుఖము నపేక్షింపవలసియుండెను. నా సురూపప్రభావమును నమ్మి మూఢవిశ్వాసమున మోసపడితిని—"నేను కడురూపవతినే- అర్జునుఁడొక మానవమాత్రుఁడే ఆస్పదమిచ్చి ప్రీతిచూపినఁ గైకొనకుండఁడు. నన్ను తానే యర్థింపకుండఁడు" అని నమ్మియుంటిని. సూక్ష్మ భంగి నామరులు నీకెంత ప్రకటించినను నీవు దాని గ్రహింపకుంటివి. నేనే వేడుకొనినఁ గడుపలుచఁదనమునకు మూలమగునను శంకచే నీవలను మీఱరాకుంటిని. ఇంక నెన్ని నాళ్లో కలదుగదా, యరణ్యావాసకాలమంతయు నిండ యుండఁగలవు కదా యాతురమేల యని దావాగ్నిబోలె నామనసుఁ గరఁగించుచుండు నీపైబాళినంతయుఁ గుప్తరూపంబున నల్లె మ్రింగుచువచ్చితిని. రేపు మీవారలయెడకు నీవుపోయెదవని విన్నంతనె తెలసితిని. పెన్నిధిగోలుపోవనున్న బీదవలె సొలసితిని. మారని శాతసాయకంబుల నెంతయు నలసితిని. నినుఁ గలసితిననుటకుఁ దక్క లేక సొలసితినను టకున్నీ చేతనున్నది. నన్నోటువడఁజేసితివి. నీ మోహవాగురన్నను వేసితివి. కడకి య్యెడకు నన్నురాఁదీసితివి. మనోరమణా! వేమాటలేల? నీయనంగ సౌఖ్యము నభిలషించిన నన్నాదరించి, దయారసముగుఱియించి, యింపుసొంపు వెలయించి, నను జయించిన భంగి నీక్రూరమారుని నోడించి రక్షించవలయునని విన్నవించుదానను, మోహము వెంచుదానను. అత్యర్థము ప్రార్థించుదానను.

(అనుబంధము 2.)

అర్జు—అమ్మా! ఎంతమాటాడితివి! ఉట్టిపాటున నెట్టిబెట్టిదంపు గట్టిడిపలుకులు పలికితివి! నిన్నింతదూరము మాటలాడనిచ్చినది నాతిచ్చపాటుగాని యిచ్చపాటు గాదు. ఇట్లు నీవు వాకొనదగునా? ఇట్టి దుర్మోహము మెకొనదగునా? ఇట్టి దుర్మతము నూకొనదగునా? ఇట్టిదుష్కార్యము పైకొనదగునా? ఇట్టిమాట లాడుటకా నీవింతదూరము వచ్చినది.

(అనుబంధము 3.)

ఊర్వ—ప్రాణవల్లభా! తొలుత నెట్టికార్యమునైనఁ జేసెదనని వచనమిచ్చి యింత

అర్జు—నేను ధర్మవిధేయుండను కనుకనే యీకార్యము దుష్టమనియు ననంగీకర్తవ్యమనియుఁ బలికెద. సత్యవ్రతుండను గనుకనే నేఁజేయఁదగినదియుఁ జేయఁజాలినదియుఁగాని యీదుష్కార్యము తగదని నుడివెద.

ఊర్వ—మనోహరా! ఈకార్యమేల చేయఁదగనిది.

అర్జు—నీవు తల్లివికావా?

ఊర్వ—నేనెట్లు తల్లిని?

అర్జు—జనకుండగు నింద్రునిఁ జేపట్టవా?

ఊర్వ—అయ్యో! ఇట్టివైదిక భ్రాంతి నీకుఁ దగునా? వేశ్యలకు మాకెక్కడి వావి?

ఆ॥వె॥ వావి యెఱుఁగరాని వనజాక్షులకు దేవ।
వేశ్యలకుఁ గణించి పృథివిలేని।
వావివరుసలెంచు వైదికభ్రాంతినీ।
కేలగలిగెనెంత గోలవైతి॥

నేనొక్కటియడుగుదును. యజ్ఞముచేయువారికిని యుద్ధమరణము నొందినవారికిని, రంభాదులగు మాతోడి సంభోగము లభించునని నీవెఱుఁగవా?

అర్జు—ఎఱుఁగుదును—అయిన?

ఊర్వ—నీవు యజ్ఞముచేసిన నాభోగము నీకుఁ గలుగదో?

అర్జు—అదేల? నీవొకతెవో యుండునది.

ఊర్వ—రాజకుమారా! ఎంతసులభముగఁ గట్టుపడితివి! నేనొకతెయె కాదుండునది. రంభాదులెందఱో యున్నారు, వారినిగూడుదువుగదా? వారుమాత్రమింద్రభోగము పడయనివారా? వారును తల్లివావికలవారుకారా యట్లైన?

అర్జు—అదియుండనిమ్ము. ఈదేహమున నాకింద్రుఁడు తండ్రి. చచ్చినపిదప నీదేహముండదుగదా? శరీరాంతరముననే మొనర్చినను దూషణీయముకాదు.

ఊర్వ—అనభిమతకార్యమును పెక్షింపుటకుఁ గారణము లెన్నియో కల్పింపఁగూడుట నేనెఱుఁగనిదానఁగాను. అకటా! జన్మజన్మాంతర తపఃఫలంబుననైనను లభింపని యప్సరస్సతితానై సశరీరసౌఖ్య మివ్వఁదలపడి వేడుచున్నను, పలదనుగోల చేలమన్నింపైన వినఁబడెనా?

మ॥ అకటాధర్మము లెన్నియో సలిపిదివ్యారూఢిఁ గన్నట్టివా।
కినైనం బరికింపరాని సురవా…

పకతానే సశరీరభోగము ఘటింపఁగోరిరాఁ ద్రోయులే।
వాకొభామామణిపైఁబడంగడగునుద్యోగంబు సద్యోగమే ॥

కటాక్ష ప్రసరణమాత్రమున ముజ్జగంబులఁగల తరుణవయః పురుషసంతానమును గెలువఁజాలునా మహిమ నేఁడిట్లుపాల్లుపోవునే? పాండుకుమారా! పురూరవశ్చక్రవర్తిని నీవెఱుఁగవో? జితేంద్రియత్వమున నాకుఁ దులయెవ్వరని చిట్టు యుట్టాడుచుండెను. వానికిగల గర్వాంధకారము, నామందస్మితచంద్రిక యెట్టు మాయించెను.

అర్జు—మరియు మేలయ్యె. ఆ పూరూరవసుడెవ్వఁడింత యెఱుగుదువా? అతడు మా కులఁపుతాతలతాత. నీమునిముని మనుమని నీవు కాంక్షింతువో? నాకూరకపంత యిడకుము.

ఊర్వ—సమక్షము వసంతయేలపలయు ?

(అనుబంధము 4.)

అర్జు—అమ్మా యింకఁజాలింపుము, పొమ్ము నాకు నిదుర వచ్చుచున్నది.

ఊర్వ—అయ్యో! నాకురాకున్నదే! నీనిద్రను సగమునిచ్చి నను నీయర్ధాంగినిఁగాఁ జేయరాదా?

అర్జు—ఇదియేటి చమత్కారము.

ఊర్వ—నాచమత్కారము కాదే నన్నీస్థితికిఁ దెచ్చినది. నన్నొకదానినొల్లవో లేక కామనన్యాసము నీకుఁ గలిగియున్నదో నీవె మేకపత్నీవ్రతుఁడవా? ద్రౌపదిమాట యటుండనిమ్ము. సుభద్రకై కైతవసన్యాసివికావో? నాయెడనా నీవు నిక్కంపు సన్యాసివైయెనది. ఉలూచిని జూచినమాత్రమునఁ గౌగలింపవో? చిత్రాంగదకు చిత్రాంగదాన మొనర్పవో. నీసౌందర్యామృత పానముననె మత్తత జెందియుండిన నాకు నీవు వెలిబోయెదవన్నఁ బ్రమత్తతగదిరె. సమ్మతిగాకున్న నసమ్మతినైన నీ విలాసంబుధి నోలలాడుదుగాక.

(మంచముపై కూర్చుండును.)

అర్జు—(దిగి) ఊర్వశీదేవి! "సాహసంపడుణంస్త్రైన" అనుమాట నీకతమున నేఁడునెగడెను. నీకిది బుద్ధికాదావల యూరకపొమ్ము.

ఊర్వ—(దిగి) మనోహరా! నీకఠినభాషణ మారుతము నాయెదనున్న మదనాగ్నినిఁ మరింత ప్రజ్వరిల్లఁజేసెదు. ఏలయోచింతువు రమ్ము. (చేయిపట్టబోవును.)

ఉ॥ ఈసకలుషోక్తులాడనను నెవ్వనిఁగాఁగ దలంచితమ్మ నిం।
దాకరకృత్యమమ్మ నిరయంబున కుంబథమమ్మ మానిసు।
శ్లోకప్రగాఁగదమ్మ జనలోకవిగర్హిత తుచ్ఛవృత్తము।
స్త్రీకొనఁబోదమ్మ బహుమానము వీడుఁగదమ్మ కోమలీ॥

ఇట్టి హేయకార్యమును సేయుందునని యొకనాఁడుతలంపను. ఎంత దేవవేశ్యవైనను ఇట్టి దుర్బుద్ధికిఁ దగునే? నీదుశ్చరితమునంతయు మాయయ్యతో విన్నవింతును.

ఊర్వ—హా! ఎంతపనిపెట్టితివి? మీయయ్య నాకొక పదిలోఁ బగునొకండౌన నాఁకేకదా! మీయయ్య నొప్పించి నినుఁగూడుదు సమ్మతింతువా?

అర్జు—ఇట్టి సాహసిని నెవరాపుదురు? నీకు నమస్కరింతు నావలఁబొమ్ము.

ఊర్వ—ఇట్టినమస్కృతి నాకువలదు.—(నాకుదసీనుపై సాష్టాంగ నమస్కార మొనర్పినఁగదా నాకుఁదనివి. దానినెట్లైన భరింతును.)

అర్జు—నీకట్టిఘటనకు వానితో నిట్టిసరసములాడఁబొమ్ము.

ఊర్వ—నీకంటె నాకెవఁడుగలఁడు. మాటలాడుకొలఁది కొలఁది మీఱిన మోహాతిశయము నన్నేమేమో చేయఁ బ్రేరేపించుఁగదా?

అర్జు—అట్లయిన నీదారిని బొమ్ము.

ఊర్వ—నాదారిని బోవనిచ్చిన నింత సంవాదమేల. ఇదియేనాదారి. (ఆలింగనము)

అర్జు—(త్రోసి) దుర్మతము.

ఊర్వ—మదనరూపవైభవా! ఉదారమహాగుణ భూషణుఁడనగు నీకీకటికి రామదియేల గలిగె, నీవు త్రోసినందున నాపిఱుఁద దెబ్బదగిలి నాకు చసీమనొప్పిగొని యున్నది గదా నీకోమలకరీకరణమున నీకతనవుగాసి తీర్పరాదా.

అర్జు—హరి హరి! (చెవులు మూసికొనును.)

(అనుబంధము 5.)

ఊర్వ—అయ్యో! ఇట్టి నపుంసకుఁడవగుదువని యెఱుఁగుదునా! నినుమోహించుట రాబొమ్మను మోహించుట యాయెనే. అంతకంటె నికృష్టము రాబొమ్మఁయైననూర కాలింగనము నిచ్చును. ఇది శూలకంటకదృషత్ప్రతిమ. నన్నింతపరిభవింతువే. ఇంత నొప్పింతువే, స్త్రీజన్మము నింద్యమగుఁగాక. అయ్యో! దయలేదే.

(అనుబంధము 6.)

అర్జు—దేవీ ! నీకు నాయానగలదు, నాయింటికేతెంచియిటునన్నారడి చేయుదువే. నీవు పెద్ద పెనంగిన నీవబలవగుదువుగాకనిన్ను నాయిల్లువెడలింతును.

ఊర్వ—పెద్దపెనంగిననిల్లు వెడలింతువా ? నీవించుక పెనంగిన నేనిపుడే వెడలిపోయెద. ఇంక నీవు మారాడిన నాపోరామి మంతయుఁ దీటి నీకు రారామియగు ఘోరశాప మొసఁగుదు.

అర్జు—(నవ్వి) ఔరా ! నను బెదరింపఁజూచెదవో ?

మ॥ భళిరేనన్నఁషియింతునంచు బెదరింపం జూచెదే శాపము ।
ల్దలపోయన్ననుఁగాని కార్యమునకుత్సాహంబుపుట్టింపఁగాఁ।
గలవంచున్నదిఁదప్పనెంచితివి నీకార్పణ్యామిందొక్కటె ।
నిలుచుఁ శాపము లెన్నియైన ధరణింధీరున్దలంకించునే ॥

సరసోక్తులఁగాని పనిశాపోక్తులనగునె. వలసిన శాపమొసఁగుము. ఈపాపగూప మునఁబడకుండ బాపిఁనఁజాలు.—

ఊర్వ—ఔనా ! నిక్కువమా ! భరింతువా కటాక్షవీక్షణమాత్రమున వేనవేల భంగులఁ బొంగింపజాలురమణీ మణితానే యర్థింపసిరికి మోకాలొడ్డిన భంగివలదని బేలు పుచ్చిడీలు పడఁజేసితేనిగాథలఁ ద్రవ్వినలవని వాపులఁగల్పించి తుదకుశాపహతి గ్రుంగిరెంటికిం జెడినరేవణభంగి విలపించువిధి నీకుఁగలిగియుండనీవేమిచేయుదువు? కామము క్రిందుపడినఁ గ్రోధముతత్థానము నధిష్ఠించుభంగి నీవెరుగవో ? నామాట నొనరింపవా ? యొనరింపవా ? నా క్రోధాగ్నినీ దయాసారమున నార్పవా ?

అర్జు—తల్లీ ! నీ కామమునకు నానమస్కారము – నీక్రోధమునకు నా తిరస్కారము. నీక్రోధాగ్ని నార్ప నాదయా సారమేలకావలయు? నీవశా... చాలదా. నీప్రతాపమిఁకఁజాలును. ఇవి పాపాలాపములు... మాట వల్కను




ఊర్వ—అక్కటా ! నాకుమాఱువల్కకుండినఁ గోపమేలవచ్చును. ...బిగువమగు వలఁదెగడు మగతనము పాటించు మగపంద నెందైనఁగంటిమే ? సముచితరూప వయోవిలాసయై, దేవనగరీనివాసయై, శాపానుగ్రహచణ విచక్షణమనో వికాస యైననీయప్సరోగంధఫలీనాసతిరస్కృతయై యూరకపోవునా ? నీయట్టిపుంస్త్వ హీనుఁడుండిననేమి యుండకున్ననేమి ? నపుంసకక్రియా విచారముననె నీవుసమంచి తాభిలాపమున్నట్టున్నది. ఏలకాదనవలె ? నాకుఁగాని నీపురుషభావము వెరొక్క

రగడ॥ నిండారు మోహమునసుమ।
కాండుఁడుమననీఁడు కరుణఁగై కొనుమనుచే।
వాండజగామిని నొల్లవె।
షండుఁడవై మనుము పురుషసత్త్వవిహీనా॥

ఇంక సంతసించితిని. సుఖముననుండు పొమ్ము. (నిష్క్ర-)

(అనుబంధము 7.)

అర్జు—హా! దుఃఖము-దుఃఖము-ఏనేమిచేయుదును. నాపరిభవమునకే మందును. ఈశ్రీయమయింతటి రాగయవునే-అకటా! ఇంతటి ఘోరశాపము పాలుచేయునే. అయ్యయో! నపుంసకభావమునే నెట్లోర్వగలను. ఏంతటి ధీరుఁడైననేమి? ఎంతటి బాహుసత్త్వుండైననేమి? ఖాండవము దహించిననేమి? ఇంద్రునితోఁబోరిననేమి? శివుని మెప్పించిననేమి? చింతామణీ· భద్రాసనార్థముననున్ననేమి? కాలకేయనివాత కవచాదులఁజంపిననేమి? దివ్యకిరీటము, దివ్యశంఖము, భవ్యాస్త్రసమితియు, చండగాండీవమును, ఇవియెన్నియుండిననేమి? అర్జునుఁడు నపుంసకుఁడందురుగదా? విజయుఁడగుదుఁగాక-భీభత్సుడవగుదుగాక-సవ్యసాచినగుదు గాక, యేమయిననేమి? నపుంసకుఁడనగుఁదుగా? కారణములేనికారణమున పదియురెండేఁడులరణ్యావాసమునకుఁ బంపిరిగా? ఇంత దుఃఖింపనైతి. పదియును రెండు నెలలింకజ్ఞాతవిధిని నిర్వహింపవలయుఁగా-ఇంతైన యోచింపను-అకటా! ఈజగద్గర్హితక్లీబభావమునకు నేనెట్లోర్చుకొందును? హా! శ్రీహరీ. (మూర్ఛిల్లును)

[ ప్ర॥ ఇంద్రుఁడు. ]

ఇంద్ర—అర్జునా! ఏల యీవిచారము. ఊర్వశివలన నీయుదంతమునంతయు వింటిని. నీమేలుకొఱకే యీశాపముఁ గలిగినది. భానుకోటితేజోంచితుఁడవగు నీవెట్టిమాఱువేషము వేసికొన్నను గుఱితింపబడకుండుటరిది. కావున నీకజ్ఞాతవిధికి మిక్కిలి యనుకూలము - ఆవత్సరముననే నీకీశాపముండగలదని సవరించుచున్నాను-యోచింపకుము.

(అనుబంధము 8.)

మ॥ తనయా భానుని తేజమింపెసఁగ సాంద్రఖ్యాతిరంజిల్లనీ।
వనయంబున్వోలు గొందగష్టతరమా యజ్ఞాతవాసంబునన్।
జను లెవ్వారును గానకుండుటది ముఖ్యసాధ్యంబె యావత్సరం।

అర్జు—జనకా! నీయాదరణమగణ్యము. ఇదినాపుణ్యము.

క॥ “ నీయాదరణమగణ్యము ।
పాయదు నాయందు పుత్రవత్సలతకృపా ।
తోయధి వైరక్షించితి ।
పోయెద సెలవిమ్ము విబుధపుంగవజనకా ” ॥

ఇంద్ర—నీ వెమియు స్తుతిసేయవలదు. తొలిజామునకు నీప్రయాణమునకు విమానమాయిత్త
మై యుండఁగలదు. నేనును వచ్చెదను.

(నిష్క్రమింతురు.)

—: ప్రథమాంకము సమాప్తము :—

శ్రీ

# బృహన్నల నాటకము.

## ద్వితీయాఙ్కము.

### ప్రథమరంగము-హస్తినాపురి

[ ప్ర॥ దుర్యోధన-దుశ్శాసన-కర్ణ-శకునులు ]

దుర్యో—దుశ్శాసనా! నేనుచెప్పినగూఢచారులను బంపియున్నావా?

దుశ్శా—అగ్రజా! అప్పుడేపంపియున్నాను, వారు సుభటులు-ధీరవిచారులు.

దుర్యో—మాతులా! ఇంత ప్రయత్నము చేసినను మనచారులు పాండవులను గుఱుతింపకున్న నెట్లు?

దుశ్శా—అన్నా! మనచారులు యుక్తిపరులు-పాండవులు సముద్రమునదాఁగియున్నను వెదకి తేఁగలవారు.

శకుని—సుయోధనా! నీవుచింతింపకుము. భీముడు బకాసురునిఁజంపిన యీర్ష్యచేమనకు సహాయుడై వచ్చియున్న యతని తమ్ముఁడు హలాయుధాసురుఁడుండ లేదా? వానితోనప్పుడే మాటలాడి యున్నాను. మనచారులవలనఁగాని మాయాబలమున వాఁడు సాధింపఁగలఁడు. అప్పుడింకను బదమూడు సంవత్సరములు ఏక ఛత్రాధిపత్యముగలుగఁగలదు.

(అనుబంధము 6.)

ఆహలాయుధుఁడు వచ్చుటకును వేళ్లైనది.

దుర్యో—మాతులా! నిన్నుమీఱినయుక్తి శాలియుధీశాలియు డెవఁడుగలఁడు. నేను ధన్యుఁడనైతిని నిన్ను నుతింపఁజాలను.

ఉ॥ ధీరవిచారనీదగు సుధీసముదగ్రత బాపియెందున।

పేరును బెంపు నిచ్చితివి పెట్టనికోటవుధీ విచారతన్ ।
కారుణికాగ్రగణ్యరిపుకాలుఁడవీవు తలంపమాతులా ॥

కర్ణ—రాజేంద్రా! నీవాపాండవులకై చింతింప నేల. ఈయజ్ఞాతవత్సరము కడచనకమును పేవారసువులఁబాయకుందురా ? నీతెజోలక్ష్మియే వారి స్వత్వహీనులఁజెసియున్నది.

ఉ॥ అర్థవిహీనులైరి పుజయుప్రదశీలవిదూరులైనయా ।
పార్థులకై ధరారమణబల్మలు చింతిలనేలనీవిభా ।
సార్థకతేజసంతతికయారెయలందురి నాఁడునాఁటికిన్ ।
వ్యర్థులుగారెనీయెదుట నాహవభూమిని నిల్వనేర్తురె ॥

[ ప్ర॥ హలాయుధుఁడు. ]

హలా—సుయోధనరాజేంద్రా! నమస్కారములు.

దుర్యో— హలాయుధా! మామామ నీతోడనన్నియుఁ జెప్పియున్నాఁడఁటనే? నీవెట్లైనను మాయాబలమునఁ బాండవుల గుఱితించి వచ్చితివా ? నీపగయు మాయందతి పగయుఁదీఱును.

హలా—రాజేంద్రా! ఈక్షణమున నీకార్యము నిర్వహింతును.

శకు— హలాయుధా! నేనింకను సంగతులన్నియు సవిస్తారముగాఁజెప్పెద నిట్లురమ్ము.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## ద్వితీయాఙ్కము.

### ద్వితీయరంగము-దుర్గాలయము.

---

[ప్ర॥ ధర్మ-భీమ-అర్జున-నకుల-సహదేవవ్రులు.]

[దూరమున-హాలాయుధుఁడు.]

---

ధర్మ—అనుజులారా! కర్తవ్యములన్నియు నిర్ధారితములాయెఁగా. మఱియొక సంకేతము-కంకవలల బృహన్నలాదామ గ్రంధితంత్రీ పాలమాలినులనిమనకు పేరులుంగదా? అయిన మనలో మనకు క్రమముగా జయజయంత విజయజయత్సేనజయద్బలాభిధానంబులుండవలయు. ఇక్కడికి సేనపనాఁడు మనము విరాటనగరిఁజేరఁ బోవలయు. దినము నౌకరుగా విరాటుని సందర్శింపవలయు. ఈభవాని. హైమవతిమమ్మెుఁదొసఁగులవలనఁదప్పించి రక్షించుట కీదేవిని నుతింతము. ఇంతలో ద్రౌపదియు సిద్ధముగానుండఁగలదు.

(అనుబంధము 7.)

(నిష్క్రమింతురు.)

హాలా—(స్థానమునకువచ్చి) భళిరె-ఈ ధర్మజుఁడు కంకసన్యాసికాఁబోవునో? భీముఁడుపలలు డగునో, అర్జునుఁడు అదియుఁగాక యిదియుఁగాక పోవునో, నకులుఁడు గాడిదెలఁగాఁచునో? సహదేవుఁడు గోమయపిండములు చేయునో? ద్రౌపదిబహిరంధ్రియగునో! భలా భలా? ఇపుడుఁగదా నాపంతము గెలిచె. ఇపుడుఁగదా నాపగదీఱె. ఇప్పుడేపోయి సుయోధనరాజున కంతయు నెఱిగింతును.

దేవి—మూర్ఖదైత్యాధమా! నన్నునమ్మిన యీపాండవతనూజుల భంగపాటునకు నీవు కారణమయ్యెదవా? నీకుఁదగినశాస్తియిదె. (పాశమునఁగొట్టును.)

హాలా—(మూర్ఛిల్లును.)

(యవనికదిగ జారును.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## ద్వితీయాఙ్కము.

### తృతీయరంగము-మత్స్యపురి.

---

[ ప్ర॥ విరాట-కంక-వలల-సేవక. ]

---

విరాట—కంకభట్టా! వలలా! అయిన నాపాండవుఁలెందు బోయినదియుఁ దెలియదో?

కంక—రాజేంద్రా! మాకుఁజెప్పుదురా! ఏమిచెప్పుదుము అటుమొన్నఁగదా వారియజ్ఞాతవాసప్రారంభము-ఉదయమునఁ దొలిజామున లేచితిమి-మేముమాత్రము నిలిచితిమి.

సేవక—రాజేంద్రా! వకపేడివచ్చి కాఁచియున్నాఁడు.

విరా—రానిమ్ము-ఆహా! రూపముమాత్రము పేడియగుఁగాక మహోన్నతతేజముఁజూడ నింద్రునినవ్వు లాడుచున్నాఁడు.

[ ప్ర॥ బృహన్నల ]

(అనుబంధము 8.)

బృహ—విరాటమహీపాలకా! అభివాదనము-నేనుబృహన్నలయను పేడిని. పుట్టినది మొదలు ధర్మరాజును సేవించుచుంటిని. అతఁడు ననుదనతోఁడఁబుట్టువులలోనివానిఁగా నన్నాదరించుచుండెను. అనవరతమునన్నుఁబాయఁడు. కుంతీకుమారులలో నన్నొకరియొక్కఁడవానిఁగా భావించుచుండెను. అతని దేవియొద్దనునన్ను సంశయింపకుండును. వలసినభంగిఁదిరుగాడుచుంటిని. ఆమహారాజునకజ్ఞాత విధిప్రాప్తించినందున నాకునట్టి విధికలిగియున్నది. ఆరాజాసమయమునెఱపివచ్చిన వెంటనే యతని తోఁజేరికొనుచున్నాను. ఈకష్టవత్సరంబున నాకింత యోలమిచ్చి రక్షింపఁబ్రార్థించెద.

శా॥ ఓరాజన్యకులావతంస విమలోద్యోగుండుధర్మాత్మజుం।
డారాజన్యునకుంఘటించెవిధి నేఁడజ్ఞాతదుఃఖంబుమా।
ప్రారబ్ధంబుగదా విచారవిధి [illegible]

వేషమునకుఁదగిన కొలఁది సంగీతనాట్యాభినయముల యందును బరిచయము వడసినవాఁడ.

విరా—కంకభట్టా! నీవీ పేడినెఱుంగుదువా ?

కంక—ఈపేడి చెప్పినదంతయు సత్యము. మాకంటే నీపేడియెయెక్కుడుగా నుండెను. రాజవిద్యాపరిచయమున నితనికంటె నెక్కుడఁగు వాడుండుటరిది. దానివలన నింద్రునైనను, శివునైనను, మెప్పింపఁగలవాఁడు. ఏందరిఁగాని యవలీలజయించును.

విరా—అంతశాస్త్రపరిచయము కలవాఁడా! బృహన్నలా! నీవుమాపురమున నే వసియించుచు, మాకుమారికలకు విద్యాభ్యాసము చేయింపుము. సేవకా! ధర్మరాజు నొద్ద వారెవ్వరు వచ్చినను మావీటనుండ నియమించినానని సాటింపుము.

కంక—అతని యశ్వగోశిక్షకులు పూజనీయులు. వారును రాఁగలరు.

వలల—వారును మావలె నే-తమ్ములేకానోపుదురు.

విరా—అశ్వగోపాలురకు సయితము చనవిచ్చునా ?

బృహ—రాజేంద్రా! అతని నెంతనికొనియాడవలయు.

(అనుబంధము 9.)

✓సేవక—రాజేంద్రా! ధర్మరాజు దేవియొద్దనుండిన మాలినియను పేరుగల పరిచారిణి యొార్తుమనయంతఃపురమున దేవిగారిచే నెలకొల్పఁబడినదనియు, దేవిగారు మీతోడమాటలాడఁ గోరుచున్నారనియు, నంతఃపుర సేవకుఁడువిన్నవించుచున్నాఁడు.

విరా—ఇప్పుడేవచ్చెదను. కంకాచార్య! వేళయనది.

(నిష్క్రమింతురు.)

———

శ్రీ

# బృహన్నల నాటకము.

## ద్వితీయాఙ్కము.

### తురీయరంగము-కౌరవసభ.

[ప్ర॥ దుర్యోధన-కర్ణ-శకుని-దుశ్శాసనులు.]

చారఁడు—దేవా ! మాయాలస్యమును క్షమింపవలయు. ఆహారనిద్రలెఱుఁగక పాండవులు పోయిన పోకలన్నియు నఱసితిమి. ఊరూర నెమకితిమి. అరణ్యముల నన్వేషించితిమి. బ్రాహ్మణరూపముల వారిసారథులమోసపుచ్చి యెంతెంతో చేసితిమి. ఎందునువారిపొలుకువ కానరాలేదు. మరలివచ్చుచో మార్గమున నొకదుర్గాలయము నికటమున దేవరమిత్రుఁడగుహాలాయుధానుఁడు పిచ్చిపట్టినట్టు మౌకత్వమునుండ నతనిఁ దోడ్తెచ్చియున్నాము.

దుర్యో—ఏఁడీ.

[ప్ర॥ హాలాయుధుఁడు.]

హాలాయుధా ! పాండవులచందము నీవేమైనఁ దెలిసితివా ?

హా. లా—(ఔనని సైగచేయును.)

కర్ణ—ఇదియేలయిట్లుతలయూఁచెదవు ? ఎందుకు మాటలాడవు.

హాలా—(మాటలరావని సైగ)

కర్ణ—ఏమీగ్రహచారము ? నిన్నెవ్వరిట్లుచేసినది.

హాలా—(దేవుడను సైగచేయును.)

దుర్యో—దేవుఁడా ? ఏదేవుఁడు నిన్నిట్లుచేసెను.

హాలా—(స్తనములు చూపించును.)

శకుని—ఓహో తెలిసెను. దుర్గాలయముదాపున నీతఁడున్నట్లుగదా తెలిసెను.

ఆదేవియేయిటుచేసినది. [illegible]

హాలా—(అవునని. సైగ)

శకుని—ఏలచేసెను ?

హాలా—(పాండవులందుండినట్లు, తానుచూచినట్లు వారు వెడలిపోయినట్లును దేవితన్నినట్లు, మేలుకొనినవెంటనే మూకత్వము కలిగినట్లు, సైగ)

శకుని—దైవముతో డొక్కటియైనను తెలియదు. ఏమిటిదిది.

హాలా—(ముఖముకొట్టుకొనును)

శకుని—నీవుపాండవులఁజూచినావా ?

హాలా—(చూచితిని—సైగ)

శకుని—వారుదుర్గాలయముననుండిరా ?

హాలా—(ఉండిరి-సైగ)

శకుని—అజ్ఞాతవిధికి వెడలిరా ?

హాలా—(వెడలిరి-సైగ)

శకుని—వారుమాటలాడుకొన్న దేమయినను వింటివె ?

హాలా—(వింటిని-సైగ)

శకుని—వారెక్కడికిపోయిరి ?

హాలా—(దూరము-సైగ)

శకుని—ఇంద్రలోకమునకా ?

హాలా—(కాదు-సైగ)

శకుని—గుహలలో డాఁగియుందుమని మాటలాడిరా ?

హాలా—(లేదు-సైగ)

శకుని—రూపాంతరముల నేమయినను గ్రహించిరా ?

హాలా—(ఔనని-సైగ)

శకుని—ఏమిరూపములఁగై కొందుమనిరి ?

హాలా—(సన్యాసి-వంటలవాఁడు-పేడి-గోపాలకుఁడు-గుఱ్ఱపువాఁడు-అనిసైగ)

శకుని—(నవ్వి) గ్రహచారము-గ్రహచారము కర్ణా ! దుర్యోధనా ! మీకేమైనఁ దెలిసెనా ?

కర్ణ—ఒక్కమాట

దుర్యో—దైవముతోడు.

దుశ్శా—నీయానగలదు.

శకుని—ఒక్కరొక్కరి నడిగెదను. ధర్మజుడే వేసముధరించె ?

హాలా—(క్షౌరము-సైగ)

హాలా—(కోపమునఁజేయివిసురును)

శకుని—నుతెమనవలయు ? విఘ్నవేషముధరించెనా ?

హాలా—(వెనుకదిరుగును.)

శకుని—కోపగింపకుము-భీముఁడే మాయెఁజెప్పుము ?

హాలా—(ప్రోయిని, కట్టెపెట్టియూదిన-సైగ)

శకుని—కొమ్మ్ముదుమాలవాఁడా ?

హాలా—(కాదనిసైగచేసి, గరిటె ద్రిప్పినసైగ చేయును.)

శకుని—బెస్తవాఁడాయెనా ?

హాలా—(తలద్రిప్పి, తపెలయునన్నముడికిన భంగియుఁజూపును.)

శకుని—మూఁగగుండ్లాటవాఁడా ?

హాలా—(వెనుక దిరుగును.)

శకుని—కోపమేలపోనీ ? అర్జునుఁడేమగును ?

హాలా—(చీరయు-స్తనములుంచూపును.)

శకుని—(స్వ) ద్రౌపది సంగతియేమో చెప్పుచున్నాఁడు (ప్ర॥ ద్రౌపదికాదర్జునుఁడు.

హాలా—(ముఖముకొట్టుకొని మీసములు గొఱుగు-సైగ)

శకుని—(ఆత్మ) మంగలివాఁడగునేమో (అనియడపము సైగచూపును.)

హాలా(ఔనని-సైగ.)

శకుని—అబ్బా ! ఇక్కడికొక్కటి తెలిసెను. అర్జునుఁడు మంగలియైనాఁడు-మంగలియైయెక్కడనున్నాఁడు.

హాలా—(వెనుకఁదిరుగును)

శకుని—కాదా ? ఇదేటి గ్రహచారము ? పోనీ నకులుడేమయినాఁడు.

హాలా—(కొరడాచూపికొట్టును.)

శకుని—చదువులయ్యవారా ?

హాలా—(తలద్రిప్పిగుఱ్ఱము సైగచూపికొట్టును.)

శకుని—అశ్వము నెక్కి యుద్ధమాడఁబోయినాఁడా ?

హాలా—(వెనుకఁదిరుగును.)

దుర్యో—మామా ! ఇదియిట్లు సరిపడదు. ఏనను పాయమున నాశయము వెడలింప వలయు.

శకుని—నాశనమాయె ! ఇంక నుపాయమేమి ? (యోచించి) హాలాయుధా !

హాలా—(తిరుగఁడు)

శకుని—కోపమువలదిదియొకమాట చెప్పుము. కాకితము తేఖనియు నిచ్చిన వ్రాయుదువా?

(కాగితము లేఖినియునిత్తురు.)

హాలా—(వ్రాయును) "నీయాజ్ఞగైకొని మాయారూపమున ధర్మరాజాదుల వెంబడించితిని వారొకరొక వేషము ధరియించిరని" (వణికించును.)

శకుని—అయ్యో! (తీసుకొని) ముందైనను వ్రాయుము

హాలా—"విపురికిఁబోయిధర్మరాజు భు"—గాను

శకుని—మిక్కిలి వణఁకుచోట్లు విడిచిమిగిలినదంతయు వ్రాయుము.

హాలా—"భీముఁడు వ-గాను, అర్జునుఁడు న-గాను. నకులుఁడు తు-గాను, సహదేవుఁడు గ-గాను, ద్రౌపది స-గాను, ఉండునట్లు నిర్దేశించుకొనియున్నారు. నన్ను దుర్గాదేవిశాసించెను. మూర్ఛిల్లితిని. లేచినవెంటనే మూకత్వము గలిగినది.

కర్ణ—(చేతతీసుకొనిపూర్తిగా చదివి) "భుగానువగానుసగాను తుగానుగగాను సగాను" ఆహా! ఎంతతెలిసెను? మొదటమనకుఁదెలిసినంతకంటే నేమియుఁ బస్కనకాకుండతెలిసిపోయెను. శకునీ! ఇంకఁజాలింపుము ఈభుగానుసగాను నీవెక్కడవెదకుదువు? రాజేంద్రా! ఆపాండవులకై యింతమనః క్లేశమేల? వారజ్ఞాతవిధిని సౌఖ్యముగ నిర్వహింపనీ. పిదపవారు గలరు నాకోదండముగలదు.

## (అనుబంధము 10.)

శకుని—కర్ణా! నీమతమెంత ధీరమతమయినను, అవివేకిమతము. కోటలువెతికిననే దుర్గుణము లేక నిరపాయముగ మనఁగలకాలసర్పములఁబాలువోనివెంచి వానికోఱలతో సాముచేసెదనందువె-దీనివలన నెంతమనకుఁదెలిసెను. వారందఱు నొక్కటే యూరనున్నారని తెలియలేదా? ఇదిచాలదా? లేకున్న నొక్కరొక్కరి నొక్కొకవైపున వెదుకవలసి వచ్చుఁగదా?

## (అనుబంధము 11.)

హలాయుధా! వారుపోయన-పురినీవుచూపింపఁగలవా! చూచియున్నావా!

హాలా—(లేదనిసైగ)

శకుని—సుయోధనా! యోచింపనేల? ఒక్కటేయూరనొక్క సమయమున నొక తరుణియు నేవురు పురుషులును ప్రచ్ఛన్నమునవచ్చి యుండఁగలయూరి నరయఁబంపుము. ఒక్కక్షణమునఁ జిక్కగలరు.

## (అనుబంధము 12.)

దుర్యో—చారులారా! సంగతులన్నియుఁదెలిసెఁగా? మీరీక్షణమున వెడలి కార్య

చారులు—భాగ్యము! మేమవశ్యము నెరవేర్చి బహుమతి నడయుదుము.

(అనుబంధము 13.)

శకు—ఈహాలాయుధునింకను విచారింపఁబగియున్నది. ఎవరైన నొక్కరచ్చులు మొదలుకొని కీలన్నియు వర్ణసరణియుగ్గడించుచు రావలయు-ఇతఁడొప్పుకొను వర్ణములవ్రాసిన నావాక్యమున మనకన్నియుఁదెలియును. చారులారా! మీకింకను బాండవులగుఱుతించు చందము చెప్పెదరండు.

(యవనికదిగజారును.)

(ద్వితీయాఙ్కము సంపూర్ణము.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాఙ్కము.

### ప్రథమరంగము-విరాటపుర ప్రాంతాకాశభాగము.

[ప్ర॥ సునందుఁడు-ఊర్వశి (ఆకాశమార్గము)]

సున—అయిననితఁడేయర్జునుఁడా? ఎంతరూపము మాఱినను దేజము గోచరించుచున్నది గా?

ఊర్వ—నామాట విననందునఁ బొడమిన దుఃఖమిది. ఇంతైనను వానిపై నామనసు మదిఁబాయకున్నది.

సున—అప్సరస్త్రరమణివగు నీవొక్క మానవుని చేఁదిరస్కృత నయ్యునిట్లాడెదవా ?

ఊర్వ—ఆహృదయశల్యము నిదివఱకుఁబరిహరింపఁజాలకున్నాను. ఏమిది ద్రౌపది యిట్లుదుఃఖించుచు వచ్చుచున్నది.

సున—(ఆలకించి) ఆహా ! కీచకు నింటిఁగల్లుతేను విరాటసతియగు సుధేష్ణయెంతపలపని ననుఁబొమ్మనెననియు తనపై మోహాతిశయమున్నదని ప్రకటించిన కీచకునొద్దకుఁ బోవవాఁడే మొనర్చునో యనిభయపడుఁచు—

ఊర్వ—సూర్యభగవానునిఁ బ్రార్థించుచున్నది గదా ?

సున—ఇదెపోవుచున్నది. ఏమికాగలదో ?

ఊర్వ—(కొంచమూరకుండి) ఆహా! యీదురాత్ముఁడీమె నెంతబరిభవించుచున్నాఁడు.

సున—అకటా ! బలిమిమైచెట్ట బట్టెఁగా ! నేనిపుడే పోయివానిమర్దించి యాపతివ్రతామణిని దప్పింతును.

ఊర్వ—ఇదిగో యిదిగో ! నీకంతయేల ? సూర్యదూత పోవుచున్నాఁడుచూడు.

సున—ఆహా ! ఇతనిప్రభావము నిమేషార్థమునవానిఁబడద్రోసె.

సున—ఈ నీచుఁడును వెనుదగిలి పోవుచున్నాఁడు.

ఊర్వ—రాజసభకు వచ్చిరి. అకటా ! ఆపాపి యీయబలనెట్లు పడఁదన్నెను !

సున—వంటలవానివలెనున్న మహోగ్రాకారుఁడొకఁడు ఎట్టిభయంకరపు చూపుచూచుచున్నాఁడు.

ఊర్వ—ఆహా ! తెలిసెను. అతఁడే భీముఁడు-సన్యాసివలె గొలువునలంకరించి యుండి ఫలభూజమును వంటచెఱుకునకై నఱుకనేలయని నెపంబిడి వానియలుకవారించువాఁడె యుధిష్ఠిరుఁడు.

సున—ఔరా ! ఎట్టిధర్మాత్మునకెట్టిపాటు ?

శా॥ క్రోధం బేఁచిన నొక్కఁడొక్కఁడు రణక్షోణిం దలంకేదియా ।
వేధోండంబుల నెల్లనుద్దవిడి నిర్వాణంబుగాఁ వైరులన్ ।
సాధింపంగల సోదరుల్గపనతేజఃఖ్యాతులన్ గల్గియున్ ।
ఆ ధర్మాత్మజుఁడెట్టిపాటువడె నాహా దైవ కృత్యంబిలన్ ॥

ఊర్వ—కీచకుఁడు పోయెను. ఈ ద్రౌపది యెంతసకరుణముగాఁదనభంగపాటు విరాటునితో విన్నవించెను.

సున—ఏమిది ? నాట్యమాడ నేలయని ద్రౌపదిని ధర్మజుఁడు వారించుచున్నాఁడు.

ఊర్వ—భళీర ! ద్రౌపది యెట్టిప్రత్యుత్తరమిచ్చెను. తనమగలలో నొకఁడు నట్టువయట.

సున—మీవాఁడేకదా ?

ఊర్వ—వాఁడె—అన్నివిద్యల నాపేడియె.

సున—ఈమొహపులింకేమి చేయఁగలరో,

ఊర్వ—నాసపుంసకుఁడు వాఁడేమి చేయునో యింటే యుండి యాఱడుగును. ఈరమణీమణికి భంగపాఁటు వాటిల్లినటకింకేమియుఁ గారణములేదు.

ఉ॥ ఈరమణీలలామకిటు వేఁచిననెవ్వగలుప్పతిల్లఁగా ।
గారణముస్గలంపవిధి కార్యమటుండఁగ నీనపుంసకుం ।
డీరసదూరుఁడీయబలుఁడీయవివేకిమగండుగాఁగఁదా ।
బోసనఁగోసచే కదనపుంసకు నాలికిమేలుగల్గునె ॥

అగంధశూన్య నామందబుద్ధి నాపుంస్త్వహీనునిఁ బెండ్లియాడు టొక్కటియె.

(అనుబంధము 14.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## తృతీయాఙ్కము.

### ద్వితీయరంగము-కీచకునిల్లు.

---

[ప్ర ॥ కీచకుఁడు.]

---

కీచక—అకటా ! ఏ నేమి సేయుదును. యెన్నఁడుఁగాని నాకు పుట్టని భ్రమము నేఁడిట్లుఁ బుట్టఁజెల్లునే ? ఇంతఁజేల తెనఘు నాకుఁజెల్లునే ? నేనువలచి చేపట్టిన వలదని త్రోయుకాంత, మున్నెన్నఁడైనఁవినబడెనే ? ఇంతఁదిరస్కృతుఁడనై యేలఁదానిఁ గాంక్షించుచున్నాను ? ఏలఁబోయినదానిఁనట్టే, పోనీజాలకున్నాను ? దానిపతులే వురు గంధర్వులుఁ గలరని యదిఁజెప్పిన మాటనిజముగానుండ నోపు—వారెల్లరు. దీనిననవరతమునే మఱకఁగాచు చుందురుగానుండు నోపు. వారు, భీమబలాఢ్యులగు టయుఁ నిక్కముఁగా నోపు. కాకున్న నే నాసతినిఁజేపట్టినప్పుడు గంతుకముగ నే తెంచి, నన్నొకగంధర్వుఁడు గెడపఁజాలియుండునే ? అట్టిదానికై నే నేలఁబయిని మాలవలయు. దానిజోలియే నామదికింకఁజేరనివ్వనుకా. ఔరా ! ఎట్టిమాటాడెదను. కీచకుఁడింత దుర్బలుఁడని నన్నెల్లరు నవ్వరోటు ? ఈభీరుత్వమునకైన నేడయేది ? ఎవ్వఁడు నన్నుఁజెనకి బ్రతుకఁగలవాఁడు ?

(అనుబంధము 15.)

గంధర్వుఁడగుఁగాక-కిన్నరుఁడగుఁగాక-రాక్షసుండగుఁగాక-పంతముమాను నన దతనమురాదుగునే. ఇప్పుడపోయి దానింబట్టిపెనఁగుదును. నాకెవ్వరీఁడు కాఁగలరు ? అదియుఁగాక దానిపై నాకున్న మోహాబ్ధియతివేలమైయున్నది. నన్నును, నా లోకమును ముంచుచున్నది. దీనిమీఱఁగలనా ? విశ్వమంతయు సైరంధ్రీప్రతిరూపమైయున్నది. ఏమాటవిన్నను దానినామమువలెనే యున్నదిగదా ! ఈదేహమంత యుఁదన్నయత్నము నావరించియున్నదిగదా ? [illegible]

యఁగలను ? తియ్యనిపణ్డ్లన్నియు, సైరంధ్రీఅధరామృతము కంటెఁజప్పిడిగాయని తోఁచునిమ్మపణ్డ్లఁగన్న సైరంధ్రి బటువుగుబ్బలఁపై బాళితీరదు. (చేయిచూచుకొని) సైరంధ్రీ! నన్నేల యింతబాధించుచున్నావు? (మఱియొక చెయిచూచి) నీవొకసైరంధ్రివా ! అయ్యో ఇందఱు సైరంధ్రులుండియు నాపాలికొక్క సైరంధ్రిలేకున్నదే? (కాలుచూచి ఇందేలవచ్చితివి బంగరు బొమ్మా ! నాకాళ్ళేటికిఁ బట్టెదవు. నీచరణములంటి వేఁడుచున్నాఁడనే (తనతొడఁగఱచుకొని) ఇప్పుడుగదా చిక్కితివి ! హా! నీయాశ్లేష సౌఖ్యమెట్టిది? మరలఁదప్పించుకొని పోయెదవా ? నిన్నువిడుతునా ? (బయలుకౌఁగలించి) మానను-మానను-నీవేమన్నను మానను. (రెండువైపులకుద్దిడి) ఈముద్దుకాయింత యగడు పడితిని. పోయెదవా ? పోయెదవా ? హాసైరంధ్రీ ! హా ! సైరంధ్రీ ! (మూర్ఛిల్లును.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## తృతీయాఙ్కము.

### తృతీయరంగము-అర్జునునర్తనశాల (ముందరి బయలు.)

---

[ప్ర॥ ఊర్వశి-సునందుఁడు. (ఆకాశమున)]

---

సున—నిన్నరాత్రి వాయుసూనునితో ద్రౌపది విన్నవించిన కరుణారస విశేషము తలఁచుకొన్న నిప్పటికిని నామనంబున దుఃఖము వొడముచున్నది. జగద్వైరిఁ సమూహాబ్ధినంతయు నాపోశనముగాఁ గొనగల వింధ్యభంజన ప్రతీపపతు లేవురుగలిగియుండియు నిట్లగునె?

ఊర్వ—ఏలయోచింతువు. నేఁడెతామసీని శీఘంబునవాని పని చక్కఁబడఁగలదు.

సున—ఏమిది? ద్రుపదాత్మజయర్జునునొద్దకు వచ్చుచున్నది.

ఊర్వ—మారుతి నియోగమంతయు నీపేడితోఁ జెప్పుకొనుచున్నది కాబోలు?

సున—సింహబలుఁడు నీయెడకు వచ్చుచున్నాఁడు.

ఊర్వ—దండకె వచ్చెను.

సున—పాంచాలి వెడలిపోయెను.

ఊర్వ—ఇందేమి జరుగఁగలదో వింపముఁరమ్ము. (ప్రక్కకు పోయియుందురు.)

(వెనుఁక యవనికనెత్తగాఁ సింహబలుఁడు బృహన్నలకాళ్లపైఁ బడియుండును.)

బృహ—సింహబలరాజేంద్రా! ఇది యేమియాఅడి.

కీచక—ఓ స్త్రీరత్నమా! నిన్ను స్త్రీరత్నమనవలయునో-పురుషరత్న మనవలయునో లేకనపుంసక రత్నమనవలయునో-నీకిష్ట మయినదేదో యారత్నమా! నీవెట్టి కఠిన దుర్గసీమలనెట్టి ఘోరతపమొనర్చి తివోయింత చెప్పుమా?

బృహ—ఏల?

కీచక—పూర్వజన్మమున నతులపుణ్యములు నీవే యొనరిచితివి.

కీచక——అయ్యో! సైరంధ్రి-మాసైరంధ్రి-నన్నుఁగాదను సైరంధ్రి-నన్నుఁగాదనఁజేయు సైరంధ్రి-నీసరసపసించు భాగ్యముగంటివె. దాని మృదుపదములు భరించుటకు, ఈ ధరణి-యీధరణి-యీధరణి-యెంతనోఁచినదో. (ముద్దిడికండ్ల కొత్తుకొని నమస్కరించును.) అకటా! నేను నీవైననుగాన యితినె?

కం॥ ఆమానినినగు మోహూ!
భామామణికులుకునడలుపలుకుల హాయలా ।
కామిని గబ్బిచనుంగవ ।
కౌమారతయెందుగలుగు కాంతలలోనన్ ॥

దాని చిలుకపలుకులు నాతెరజంటితేనెన్నిగిలి వెలివచ్చుటచే యేలితీయని పలుకులు-ఆస్యకమలములనుండి వెడలుటచే వలపుఁగులుకు పలుకులు రసపుంపముల యుండలు గలుగుటచే ముద్దులఁగులుకుపలుకులు ముద్దునాలుక తిన్ననియుదరున వెలిఁజేయుటచే జిలిబిలిపలుకులు. వలపుసోలపుపాలుపు నిలిపి పిసాళించు కలికిపలుకులు విను భాగ్యముగంటివే?

(అనుబంధము 16.)

బృహ——కీచకరాజా! నీకుఁబ్రొద్దుపోవదో! ఇట్లేల కలువరించెదు.

కీచక——తప్పుఁబలికితివి సుమా. కలుపరముతేక యేకదా యింతగతికి నన్నాముద్దులాడి తెచ్చెను. నిద్రనైన నాయిందుముఖిసురత సౌఖ్యంబింత పొందుదమన్న నా నిద్రతే కుండఁజేసియున్నది. బృహన్నలా! ఈచంద్రహారము గైకొనుము.

బృహ——ఇదేల?
కీచక——కైకొనుము నీకేల-ఈకడాణి బన్నురసపుఁ గైకొనుము. నాప్రాణమే కైకొనుము.
బృహ——ఏల యిట్లాడెదవు?

కీచక——నీకును మాసైరంధ్రికినిఁ గడుపరిచయమున్నట్లున్నది. ఏ——యంతఃపురము నను నీప్రవేశమునకు నిరాటంకము-ఏచెలువయుఁ నీకు సైదోడు. కరుణించి మాసైరంధ్రినిఁ నాకు గూర్పుమా!

బృహ——హా! హా! హరిహరి. (అని చెవులు మూసికొనును.)

ఊర్వ——(ముందరికివచ్చి) జగన్మోహన మనోహరాప్సరస్తరుణీమణి తాసైవలచిపైఁబడి నవలదని త్రోసిపుచ్చిన నపుంసకుఁ డిట్టిపనికైనఁదగడా?

కీచక——బృహన్నలా! ఏమిట్లు హరి-హరి యంటివి-హోహో! తెలిసెను. నీకును మాసైరంధ్రిపై మోహముగలదో? పురుషునకుంసతికిందప్పనపుంసనకే యామోహ

బృహన్నలా ! ఒకప్రాణికిఁ బ్రాణాపాయమువలనఁ దప్పించిన యుపకారము నీకు గలుగఁగలదు. నీచరణము లంటివేఁడెదను (అని కాళ్లపైబడును.)

బృహ—(ఏడ్చును.)

కీచక—బృహన్నలా ! నాకంటె నెక్కువగా నేడవసాగితివి. ఆహా ! తెలిసెను. నన్ను మోహించి యున్నావేమోకదా ? నీవు కామించిన నేనింకొక్కసతినిఁ గోరినందున జనించిన యీర్ష్యచేఁ జేయునదిలేక దుఃఖింతువో ? రమణీ ! నాపనిమా త్రముఁజేయుము. దాని ముద్దుఁగొన్న వెంటనే పూర్ణాధరపానమైన నాసింపక నే తెంచి నిన్ననంగక్రీడఁ దేలింతును.

బృహ—క్రూరకర్మా. తొలఁగిపొమ్ము. పలుమాటలు పలుమాటలాడిన, ముచ్చాప మున-మచ్చాపమున నిను భస్మీభూతునిఁజేసెద.

కీచక—చాపమున-ఛాపమున, ఆహా-ఆహా-సైరంధ్రీ ! యిక్కడికేవచ్చితివా ? చిక్కి తివి, తప్పించుకొనలేవు-విడువను. విడువను. (అని అర్జునిఁగౌగలించును.)

బృహ—ఛీ! పాపాత్మా. (అని త్రోయును.)
కీచక—గంధర్వుఁడు. గంధర్వుఁడు (అని దూరమున నెగరిపడి మూర్ఛిల్లును.)

ఊర్వ—ఈపాపికీచకుడు, నోచినపుణ్యము నేను నోమగదా. బలవంతమునసైన నా లింగినముఁవడసె. వీడో నేనోచినపుణ్యము నోచినాఁడు. తెగడువడి క్రిందపడెను.
సున—ఊర్వశీ ! మనమింకపోవుదము. ఏమి జరుగఁగలదో జూతము.

(నిష్క్రమింతురు.)

బృహ—ఆహా ! యీపాపిదైవమునకేనునవలయు. నాదుఃఖమునకేమనవలయునా పాటునకు దుఃఖింతునా ? ద్రౌపది యీ కీచకుని చేఁబడుపాట్లకు దుఃఖింతునా ? ధరణిలో నెవ్వరికైననిట్టి బెట్టిదంపు కట్టడిపాటుగలిగెనె ? అకటా ! నాజన్మమిక నేటికి ? రూపమువలననేకాక కార్యమునందును పౌరుషహీనత బ్రాపించెఁగా? ఈ దుఃఖమునేనెట్లు తాళుదును. ఆహా ధర్మతనయా ! మనకెటి భంగపాటువాటిల్లె. రాజసభలో నీయాలినొక నీచదురాత్ముఁడు కాలదన్న సత్వహీనునివలె నూరకుండు భంగిప్రాప్తించెనె ? అంతటి మానముద్రకలిగెనే? అయ్యో! నాయన్నరదమ్ములవలెఁ గాక నాకిట్టి భంగపాటువాటిల్లునే. వారూరక ద్రౌపది పరిభవమునకు నోర్చుకొ నిరిగాక నావలె వంతబడిరె. అకటా ! ఈదురాత్ముఁడు నా తోడనిట్టి ప్రల్లదంబులు పలుకునే. నాసతీమణిందనకు సమకూర్పనన్నిటడుగునె ? హాదుఃఖము. హాదుఃఖము నేనెవరితోడఁ జెప్పికొందును. నావగనెవ్వరు తీర్చువారు, నా హృదయశల్యము నెవరువెలిపుచ్చువారు. ఈకలుషాత్ముడు నన్నేయిట్లు పరిభవించెగదా? యిక ద్రౌ పది నెట్లు చేసియుండడు ? ఆయబలయంతదుఃఖ పడెనో ! ఆసంగాపరాభవ...

పుశాపము నాకిత్తువె? నను నిట్లుపరిభవింతువె-నా జితేంద్రియత్వమునకా యీబహుమానము. అందటిపలెనేనున్న నాకీ కుందులేకుండెఁగా? అటుగాక యీ హేయరూపముగలిగినందున గదా? యీ నీచునితో నిట్లననిపించుకొంటిని. అకటా! ద్రౌపది వచ్చినన్ను యీకీచకుండే మనెన, నేనేమని వచింతును. ఎట్లు దానికి ముఖము చూపుదును.

సీ॥ కన్నులారఁగనింత కష్టకృత్యముజూచి
యుడుకుమైనెటులూర కుండువాఁడ ।
ఉండెదఁగాక యాయువిద పాటులకెల్ల
డీలువారఁగనెట్లు తాళువాఁడ ।
తాళుదుగాక యింత నె చేర నేతెంచు
ద్రౌపదికెటు మోము చూపువాఁడ ।
చూపుదుగాక యాసుదతికీచకుఁడేమి
చెప్పెనన్నమఱేమి చెప్పువాఁడ ।

తే॥గీ॥ కటకటానే దురలకు నైనఁగలుగవ ।
లవ దీతిరస్కార దుఃఖమజ్ఞాతవాస ।
మునకు బహుకాల వనవాసమునకు నైన ।
దాళితింగాని యిది తాళఁజాలఁచాలా ॥

హా! దైవమా! నన్ను నీవెంతచేసితివి? రాజ్యభారవహనముబాపి యరణ్యసామ్రాజ్యమునకుఁ బట్టముగట్టితివి. చూడ్కికీ మిరు మిట్లుగొలుపు స్వభానుతేజముబాపి యూరుపే రెఱుఁగకుండునట్లు చేసితివి. శరణాగతాభయదానశౌండములును ధనుర్జ్యాకిణాంకములును శరచాపాధికప్రవీణములునునగుకరములకుఁ దాళము లిచ్చితివి. పరాభేద్యాంచితవర్మసముదారంబగు యేనపయ్యెదఁగలిగించితివి. వైరిరాజన్యనారాచ ప్రమోహావజ్రాది ప్రతీపంబగునురమునకుఁ గంచుకము దొడిగించితివి. మహేంద్రవరప్రసాదప్రభవానంతమణీరారాజత్కిరీటమునకు మాఱు శిరోజాత కిరీటము నిచ్చితివి. రాజరాజాంగవిద్యాప్రవీణతనలరారు మంత్ర సంవాదములఁ బ్రబోధించు నోటస-రి-గ-మ-ప-ద-ల నిల్పితివి. వినియుక్త బాణధనుర్గుణ యుక్తకరాంగుళీసమాలంకృతంబులగు శ్రవణంబుల బ్రవాళకీరపత్రముల నలంకరించితివి. ధీరరణకంకణాంచితములగు మణిబంధములకు గాజులుఁబెట్టితివి. ఇంతయ్యునీ పగదీరదో. ఏలనన్నిక్లేచుచున్నావు-హా! నిర్భరము-నిర్భరము కీచకా! కీచకా! సర్వాలయముల నుండు దైవతములారా! ఓషధీసిద్ధులారా! మారణమంత్రౌషధములనిచ్చి నాకపమున కంతము చేయరాదా? హా! ద్రౌపది! ద్రౌపది!

శ్రీ

# బృహన్నల నాటకము.

## తృతీయాఙ్కము.

### తురీయరంగము-విరాటనర్తనశాల.

[ప్ర॥ సునందుఁడు-ఊర్వశి.]

ఊర్వ—ఇక్కడనే యొకచోట నుందము.

సున—అవును. నేఁడుకడువినోదము జరుగఁగలదు. భీముఁడును, కీచకుఁడును మహా బలయుక్తులు వారిరువురియుద్ధము కన్నులకుఁ బండువుగావింపఁ గలదు.

ఊర్వ—అదిగో చప్పుడు వినుపించుచున్నది. భీముఁడును ద్రౌపదియు వచ్చుచున్నారు కాఁబోలు. (ప్రక్కకు పోవుదురు.)

[ప్ర॥ భీమసేనుఁడు-ద్రౌపది.]

భీమ—ప్రియా! ఇయ్యెడనే మనోహరముగా నున్నది. ఇదియే యిక్కడ మెత్తవేసి యున్నట్లున్నది.

ద్రౌప—కీచకుని సేవకుఁడు నాశాలకు వేసియున్నట్లున్నది.

భీమ—అయిన మేలాయె. వాఁడిందువచ్చుననుటకు సందేహములేదు.

ద్రౌప—సందేహ మేమియులేదు.

భీమ—ఆహా! ఇట్టి దుష్కులుఁడు ముందెన్నఁడైనవినఁబడెనె? వానిజూచినే సహింపగలనా? సప్తలోకములకల గుండువెట్టఁజాలు. అంకెయొకటివైచి గరుడుఁడు పన్నగముల నొడిసిపట్టినట్టు లాక్రమించి మెదపి యొకముద్దచేసి విరటుని పత్నిను ధేష్ణ మ్రోలవైచి వచ్చెద.అందునకేమైన విరటుఁడడ్డమాడ వచ్చినవానిం బొరిపుచ్చెద.

ద్రౌప—భీమసేనా! అట్లయిన నీసాహాయ్యము వలదు, నాగతిశాలది పోయెదను.

ద్రౌప—మనగుట్టు వెలిపడుఁగదా! అప్పుడు మనము మరల ౧౨ సంవత్సరములడవి కేగవలయును. ఆ యపకీర్తియంతయు నాతలపై నిల్చుఁగదా? నాకిదివలదు.

భీమ—కామినీ! నీవేలభీతిల్లెదవు? రోషావేశమున నిట్లంటిఁగాక సమయభంగమునర్చి మరల ధర్మాత్మజునికి సంతాపము గలిగింప నేవెఱ్ఱివాఁడనా?

ద్రౌప—అట్లయిన నొప్పుకొంటిని నాథా! మనకెట్టి సంతాపముగలిగె. శక్తియుండియు శక్తనెల్లడిచేయుకార్యము నొనరింపక యుండవలసెఁగా? అయ్యో! ఆదురాత్ముఁడేతెంచి నీయెదుట ననుపలుమాటలాడనున్నాఁడు గదా? దాని నీవు వినవలసె-నీవు వినుట నేఁజూడవలసె.

భీమ—అతివా! ఇందుకు సంతాపమేల? నే వాడువచ్చిన వెంటనే పొరిగొనను. ఏమి మాటలాడ నున్నాఁడో చూచెదను. కొంతసేపు వినోదముల జరిపి నీకు ముదము గలిగించెదను.

ద్రౌప—అయ్యో! అది యేమియు వలదు. ఆ చండాలుని దుర్మార్గోక్తుల నీవేల వినవలయు?

భీమ—అటుకాదు. నాకేమో కుతూహలము గలిగెడు. నామాటకు మారాడకుము. ఈశయ్యనే శయనించి యుండెద నీవట్లు దూరముననుండుము.

ద్రౌప—అయిన నీయిష్టము.

భీమ—దేవీ! ఒకవేళ నేను, నాకీచకుఁడును పోరాడుటలో వాఁడేననుజయించిన నెట్లు?

ద్రౌప—భీమసేనా! నేఁడేమిచిత్రము. ఇట్టిమాటల నీనోటవింటిని?

(అనుబంధము 17.)

భ్రుకుటిమాత్రమున ముజ్జగంబులఁ గలఁచఁజాలు? నీయట్టి వాఁడిట్టులాడునె నాకుఁ జూడ నూరక నా మనసరయఁగోరి వేడుకకడిగితివని తోఁచెఁగాక, మనసార నీవిట్టి భీరుభంగి నుగ్గడించితివని నేనమ్మను. ఒక కిమ్మీరహిడింబులలో నీతుచ్ఛ పాపుఁ డెక్కుడి కెక్కును. అదిగాక ధర్మదేవతసాక్షాత్కరించి జనియించినట్లు త్రిజగంబుల నజాతశత్రుఁడని పేరొందిన యమసుతసూనుని పోష్యముననున్న మనకుఁ జేటెన్నటికైనఁగలుగఁగలదా! అంతధర్మము పాడగునె? అయినను వేడుకగా నీవడిగితివిగాన ప్రత్యుత్తరమిచ్చెదను. ఇది చూడుమా కటారి. ఇది యొకరి ప్రాణము తీయుటకు నిస్సందేహముగఁ జాలియున్నది. యీయాయుధమున వానిప్రాణమొండెనా ప్రాణమొండె కడజేయఁజాలుదు.

భీమ—(ద్రౌపదిని కౌగిలించి) ఇప్పుడు నామదికెక్కె ఇప్పుడుగదా నీవు వీరపత్ని

షమున వానినుక్కడింపఁజాలనా ? అదె సవ్వడివినవచ్చె. నీవు దూరముననుండుము.
కాదు. దాపుననే యుండుము. (ద్రౌపది మరుగున నుండును.)

[ప్ర॥ కీచకుఁడు (భక్ష్యములతో).]

కీచక—(స్వగతము) సైరంధ్రి వచ్చియుండునా ? ఏలవచ్చియుండదు. అదియేమి
మానవస్త్రీకాదా ? నాసురూపమునకు మరులుగొని యుండదా ? నేఁగొంతయు నో
కిక యొనర్చితి. మీఱరాని మోహావేశమున సమయము గుఱుతెఱుఁగక యత్నపైఁ
బడనుద్యమించితి. ఎంతసురూప సంపత్తిగలవాఁడనై యుండిననుదానికి నన్నుఁ
జూచి నంతనేయెంత బాళిపై బొడమినను. అంతహుటాహుటి క్రియకు సమ్మతిం
చునా ? వివేకినై కొంతవకాశమిచ్చియుండిన నాకోరిక ఫలించుచుండెను. ఇంతే
రంతునుదపుచుండెను. అయినదయినది. ఇప్పుడేలయోచనలోనికిఁ బోయెదను
(పోయితిరిగివచ్చి) ఆహా ! ఎంతచీకఁటిగానున్నదీయెడ. ఇట్టి సంకేతమునకిన్ని
నియమముతో నన్నేలయాతన్వంగిరమ్మనియె. చీకటింటనేల యభిలషించె ఆహా!
తెలిసెను. ఈతరుణీమణి యెందెందును వేఱొక్కర్కి లభించినట్టులేదు. నాభాగ్య
వశమున నన్ను మాత్రము మోహించియున్నది కాని, యీక్రియదానికి చిరపరిచి
తముకాదు ఇప్పుడెపోయి దాని గాఢాలింగనము వడయుదునా ? (మరలదిరిగి)
ఏమిది యీయింట దూరవలయునన్నఁ జంకుకలుగుచున్నది ? దీనియం దేమైన
మోసముండునా ! దానిపతులు గంధర్వు లిందేమైనఁజేరి యుందురా ? ఆహా !
నేనెట్టిభ్రాంతుఁడను ! గంధర్వులేయుండి, వారు బలిష్ఠులేయైయుండిన నీచోటికేల
రావలయు. నాయింటనే నన్ను నిర్జింపలెక్కరా ? ఈసైరంధ్రి నన్నేల మోహిం
చిన మాటలాడవలయు ? ఇదియంతయు నూరక పనికిరాని సంశయము. ఊరక
బెగడొందుచున్నాను. ఎన్నఁడును నిట్టి చోరరతిఁ సౌఖ్యమెఱుఁగనివాఁడనగుట
భీతిల్లుచున్నాను. పోయెదను. (పోయి) (మెల్లగా) సైరంధ్రీ సైరంధ్రీ ఏమి పలుక
కున్నది. (కొంచము గెట్టిగా) సైరంధ్రి ! సైరంధ్రీయని పిలుచును.

భీమ—(మెల్లఁగా) "ఊఁ" (యనును.)

కీచక—వచ్చియున్నావా బంగరుబొమ్మా ! నీవేల రాకయుందువు ? అయ్యో ! నా
కొఱకెంతసేపు కాఁచియుంటివో క్షమింపుము.

భీమ—నీకొఱకే కాఁచియున్నాను.

కీచక—దేవీ ! నాభాగ్యమునకు సమానములేదు. ఇదే నీకుఁ బనివిడీలు భంగిరమణీయము
మగు ఫలాహారములఁదెచ్చి యున్నాను. స్వీకరింపుము. ఇప్పుడైన స్వీకరింపుము
—పిదపనైన గానిమ్ము.

భీమ—పిదప [illegible]

కీచక—కొమ్మా ! ఈచీకటింట నీకేమికోరిక, యేమానందము ? కొంచెము వెలుతురు తెత్తునా? వెలుతురునసైన నీమనోహరాంగ సౌందర్యమింకను రమణీయముగనుండు నే?

భీమ—అయ్యో వలదు. నాయంగసౌందర్యము నీవు వెలుతురునఁజూచిన భీతి జనించెదు.

కీచక—నీకా ! భీతియా ! అయ్యో నీదాసుఁడనై చెప్పినకార్యము శిరసావహించి చేయుచున్నామరణము నినుబాయకుండువాఁడనే. అటుబాస చేయువానిగురించి నీ కేలభీతి ?

భీమ—అయిన, నామరణము నను బాయవా ?

కీచక—సంశయించెదవా ? కావలయునన్న నామనసైనఁజూడుము. నే నంగీకరింపనని నీవు మాత్రమనుము. నీయెదుటనే మృతిఁజెందెదను.

భీమ—మృతికొఱకంతయేల? మృతియొరానలయు నన్నునే నంగీకరించిన మృతిఁగలుగదా?

కీచక—తరుణీజనవతంసమా ! నీమాట నాకభేద్యముగా నున్నది. సిగ్గరివైయెమేమో మాటలాడుచున్నావని తోఁచుచున్నది. సిగ్గుపడలుము. నిక్కముగనే నీవాఁడఁగా కన్యులకుఁ జిక్కను. నీవు నాచెంతనున్నఁజాలు. స్వర్గమున నుర్వశీసంభోగమునైన సరకుకొనను.

భీమ—స్వర్గముననున్న నుర్వశిని చూడవలయునని నీకంతభిలాషమా ?

కీచక—తరుణీ ! ఆయూర్వశి నీ కాలిగోరిసైన యగునా?

భీమ—ఏల ! నీకాయూర్వశియే సిద్ధించుఁగాని లెమ్ము. పిలుతునా యూర్వశిని.

కీచక—అయ్యో! దేవీ! నీకంతకోపమా ? లోకమున నందఱు నుర్వశికడు ముద్దులాడియని పలుకుచుండఁ బ్రస్తావనవశమున దాని పేరెత్తినంతయే యంతయసూయయా ? కైకొనుము ఫలాహారముల-వీని రుచియయినఁజూడుము.

భీమ—(తినఁదొడఁగును.)

కీచక—తరుణీ ! నన్ను నేనప్రశంసించుకొననేరను. నన్నుగాంచిన తరుణులందఱు నాయట్టి పురుషుఁడు లేడని యగ్గింతురు. అట్టివాఁడ నీకు దాసుఁడనైతి. నీభాగ్యమెట్టిదో కదా !

భీమ—ఇంక నన్ను నేనప్రశంసించుకొనవలయునా ? ఈభూమండలమున నాయట్టి సతిని నీవకాకింకెవ్వరునుఁజూచి యుండరు. అట్టి నాసరసకేతెంచితివి గాంచఁ

కీచక—భళిభళి! నీవట్టిదానవే యగుదువు. ప్రియా! నీవే భుజింపవలయునా యీ ఫలాహారముల? నీముద్దుచేతుల నాకింతయొసఁగరాదా?

భీమ—కొమ్మ్మ (అని కన్నుపొడుచును.)

కీచక—(కన్నుల నులుముకొనుచు) అయ్యో! కాంతామణీ! నాకన్నెంతగాఁ బచితివి?

భీమ—చీఁకటి. నీకింత సమీపమునకు వచ్చియుండుట నీవైనయెఱుఁగుదువా? అయొ వచ్చిరాకయే కన్నుపోయిన ముండెట్లు?

కీచక—నీ వేమియు భీతిల్లకుము. ఏమో కొంచము తగిలెఁగాని, బాధయేమియు లే

భీమ—ఊఁ.—

కీచక—అయినా ఫలాహారము?

భీమ—కొంచెము—(తినును.)

కీచక—చేపి! ఇంతదూరము నీకొఱకైవచ్చి యింతసేఁపునీసరస నసించియున్న నాలింగన మియ్యకున్నావేల?

భీమ—ఫలహారములు ముగియవలెనా వలదా?

కీచక—తరుణీ! నీ [illegible] ము వింతగానున్నది. కోయిల నాకర్షించు పలుకులుగల నిట్టి కటుభాషణంబులేల కలిగె. ఫలాహారముపైఁ జింతయెంతయు నున్న తోఁచెఁగాని నిన్నేనమ్మి నీ చరణదాసుఁడనై యున్నవాని మఱచినట్లున్నది.

భీమ—ఇంక కొంచెము ఫలాహార శేషమున్నది. నిలువుము. నీపనితీర్చెదను. న భక్ష్యములున్నప్పుడు కటు భాషణంబులు నీకొఱకై కాకుల నాకర్షించుమాట కాక, కోయిలల నాకర్షించు పలుకులు గలుగునా?

కీచక—నాకాలింగనమిచ్చి నీఫలాహారముం జేయరాదో? ఆహా! తెలిసెను. నీకు విశేషముగా నున్నందున నీవైమున్నాడి యాశ్లేషింప సాహసింపవు కాఁబో అయిన నాకు సెలవా?

భీమ—ఇప్పుడె నీకు సెలవిచ్చెదను. (లేచిపట్టును.)

కీచక— గంధర్వుఁడు! (పట్టుకొనును.)

(ఇరువురు మల్లయుద్ధ మొనర్చెదరు కీచకుఁడు క్రిందపడి చచ్చును.)

భీమ—కాంతామణీ ఇటురమ్మ. చూడుము. నీకుఁ గీడాచరించిన పాపాత్ముని.

(వెలుతురుతెచ్చి చూచెదరు.)

ద్రౌప—(కీచకునిఁ గాలదన్ని).

(అనుబంధము 18.)

భీమ—నాకేమియు స్తుతిపలదు. ఇదె తెల్లవారవచ్చె. స్నానమునకుఁ బోవలయు. నీవు నిశ్చింతముగాఁ బొమ్ము.

(ఆశ్లేషించికొని నిష్క్ర.)

[ప్ర॥ ఊర్వశి.]

ఊర్వ—అమ్మా! ద్రౌపదీ!

ద్రౌప—ఎవరది? ఎవరది? నాథా!

ఊర్వ—అమ్మా! నీవు భీతిల్లకుము, నేనే ఊర్వశియను దేవవేశ్యను. (చెవిలోచెప్పి) ఈ కారణమున నీ యొడనుంటిని. నీయట్టి పతివ్రత చరిత్రను వర్ణించుకొనకపోవుట యుచితముకాదని నీకుఁ గనిపించుకొంటి. నీయద్భుత పాతివ్రత్యముగాడె నిన్ని దోసగులవలన దప్పించెను. నీకెప్పటికిని నిర్భయము. నేఁపోయివత్తునానతిమ్ము.

ద్రౌప—ఊర్వశీదేవి నాయెడ నీప్రేమ నిర్వ్యాజముకదా.

(అనుబంధము 19.)

(నిష్క్రమింతురు.)

—:తృతీయాఙ్కము సమాప్తము:—

శ్రీ

# బృహన్నల నాటకము.

తురీయాంకము.

ప్రథమరంగము-కౌరవసభ.

[ప్ర ॥ దుర్యోధన-కర్ణ-శకుని-చారులు.]

దుర్యో—చారులారా! వారినెక్కడపెట్టియున్నారు.

చార—భోజనమునకుఁ బోయియున్నారు. రాఁగలరు.

దుర్యో—వారే పాండవులని యెఱుఁగుదురా?

చార—వారుకాకున్న నిఁకొక్కరుండరు. ఎందుకన్న విరాటపురి-కుంతలపురి రెండు పట్టణములఁదప్ప భూలోకమున మఱియొక్కచోట నాల్గురు జనులు నాగతులై యొకసారివచ్చిన వారులేరు. మేముతెచ్చిన వారు కుంతలపురి నుండినవారు. విరాటపురినన్న నేవురుపురుషులు నొక స్త్రీయుకాక నలువురు పురుషులును నిరువురుస్త్రీలును వచ్చియుండినారు. కావున వారిని మానవలసినది.

[ప్ర ॥ ఏవురుపురుషులు-విధవ.]

(అనుబంధము 20.)

1 పురుష—అయ్యో! అయ్యో! ఏ మన్యాయము! ఇట్టి వేదురుపట్టిన దురా... జగంబునజన్మె విడుఁవఁజన్మె-నేను ధర్మరాజునఁట! ధర్మరాజునకిట్లే జాడ్యము కలిగియుండెనా? రాజేంద్రా చూడుము.

2 పురుష—నేను భీముడఁట! నాకొక ద్రౌపదినిఁ దెచ్చియివ్వక పోయిరే?

3 పురుష—నేనర్జునుఁడఁట! ఇదిగో నాగాండీవమునుఁ జూడుము. (మెడలో... రుద్రాక్షహారము నిచ్చును.)

పురుష.—నేను నకులుఁడు. నకులమనఁగా ముంగిస-ఇదిగో నాయనుజుఁడౌ తమ్ముని సహదేవునిఁ జూడుము. (ఒక పెద్దవానిఁ జూపి నవ్వును)

పురుష.—నేను సహదేవుఁడను. ఈమె మా తల్లి మాద్రి కాబోలు? పాండురాజ శవము గ్రహించిన వెంటనే త్రాళ్ళఁ జెందుకొని పాఱుతెంచిన మగడులేని ముత్తైదువ యీ బిడయే సుమా?

విప్ర.—నేను విప్రుఁడను. నన్ను మాని దేశముపైఁ బోయియున్న పుత్రున న్వేషింపుచుఁ గుంతలపురికి వచ్చి యిశక్తనైపడితిని. వీరు ధర్మగుణముచే నాకింత పరిచర్య సేయు చుండిరి. రాజా! నీచారులు నాకే పురుషులుఁ గల్పించిరి. నేను ద్రౌపదనఁట! అయ్యో! ఆమెకెంత యవస్థవచ్చెను. నీఁడ లేకకొందుక్షను-బోనగొట్టుకొని విలపించు చున్న బ్రాహ్మణ విప్రయారయెఁగా?

దుర్యో.—ఇది కడుచిత్రముగా నున్నది.

చార.—దేవా! వీరే పాండవులు. వారు తమసమయభంగము కాకుండుటకై యిట్టి బండి వేసముసు పైవేసికొనఁగలరు.

అందఱు.—కాదయ్యా! కాదయ్యా!

దుర్యో.—కాకున్న నేమినష్టము. నెలరెండు నెలలు మిమ్ము నిర్బంధమునసుంచెదను. పాండవులు వచ్చిన వెనుక విడిపించెదను. రాకుండిరా! మిమ్ము నే మరల నరణ్యము నకుఁబంపెదను.

అందఱు.—అయ్యో! అయ్యో!

శకుని.—సుయోధనా! నాకొకటి తోఁచుచున్నది. ఇదివరకు విస్మృతుఁడైయుండి అలాయుధాసురుఁడు నేఁడు కనువిచ్చియున్నాఁడని వింటిని. వానిఁబిలపించిన వాఁడు చెప్పగలఁడు.

దుర్యో.—సేవకా! అలాయుధాసురుని దోడ్తెమ్ము. మాతులా! వీరే పాండవులుగా నుండనోపుదురని తోఁచెడు. విరాట-కుంతలపురములప్ప నింకెక్కడను వారుండఁ జాలరుగదా? విరాటపురి నిద్దరు స్త్రీలుండుట నందు వారు లేరు. అదియుఁగాక యాపురంబునఁ గీచకుడను పటుబలాఢ్యుఁడు విరాటుని మఱఁదియున్నాఁడు. అట్టియెడ వారు పోవరు.

చార.—దేవా! ఒకవిన్నపము. దేనర కీచకుడన్న జ్ఞప్తిఁగలిగె. వాఁడొక సైరంధ్రిపై దుర్మోహముఁగలిగి తత్పతులగు గంధర్వులచే నొక నిశీథమునఁ దన నూటయేవుర ననుజులతో వధింపబడెనని మేము విరాటపురి విడిచిన పిదపఁ దెలిసెను.

దుర్యో—ఏమీ! ఏమీ! కీచకుఁడు-భీమసేనుఁడు-శల్యుఁడు-బలరాముఁడు - వీరు సమబలులు.

[ ప్ర॥ అలాయుధుఁడు. (దీనుఁడై.) ]

అలాయుధా! పాండవులిట్టివేషముల నేమైనధరించిరా ?

అలా—(కాదని సైగ.)

దుర్యో—వారు విరాటపురికేమైనఁ బోయిరా ?

అలా—(ఆశ్చర్యమున ఔనని సైగ.)

దుర్యో—అలాయుధా! పొమ్ము-జనులారా! మీరును యథేచ్ఛముగఁ బొండు. మాతులా! ఇంక యోచన యేటికి-ఆ సైరంధ్రియే ద్రౌపది. గంధర్వులే పాండవులు వారిని మనమందరవశ్యము గురుతింపవచ్చును.

ఉ॥ నిండుమదంబు మానక జనించు విరాటుని ప్రోలువారలే।
పాండవులా విరాటుఁడును వైరియగు న్మనకింక వానిగో।
మండలిఁబట్టి వారలభిమానమదంబునఁ బోరవత్తురా!
ఖండనసీమవారిఁగని పట్టివనంబున కంపనింపగు౯ ॥

(అనుబంధము 21.)

విరాటుని గోధనము మిక్కిలి బలిసియున్నట్టువినికి. అతఁడు మనశత్రువుఁడు. ఇదే సమయము. సుశర్మను దక్షిణమున నున్న గోవులఁబట్టఁబంపుదము.. వారితో విరాటుఁడు యుద్ధమునకువచ్చును. మఱునాఁడు మనమందఱ ముత్తరమునఁ బట్టుదము. అపుడు పాండవులే వచ్చెదరు. అట్లను రాకుండిరా మనము ముట్టడించినపుడొక్కింత సైన్యము నూరిపయికిఁ బంపుదము. వారు చిక్కకమానరు. కర్ణా! నీవాయితముగనుమ్ము.

కర్ణ—నాతోడఁ జెప్పవలయునా! పాండవులందఱటుండనీ. అర్జునుఁడు మాత్రము వారితో వచ్చెనా యపుడుగదా నాపండువు.—

కం॥ ఏపార కేఁపె పోదము।
కోపాటోపంబు వెలయఁ గుంతిసుతులలో।

నాపార్థుఁడొకఁడువచ్చిన।
నాపండువుగాదెమనుజ నాయకచంద్రా॥

శకుని——ఇంక మనమాచార్యాదులనెల్లఁ బిలిపించుదము.

మ॥ మనసారంగను నింతసంతసము సంపాదింపఁగాఁగల్గునే!
ఘనదుఃఖంబులు దీఱెనంచుమదిలోఁగర్వించియున్నారుగా।
వనభూమింబడగూఢభంగిమఱియుం బ్రబ్రెండునొండేండ్లపం।
చినఁగాదే చిరరాజ్యమబ్బునృపతుల్సేవింప దుర్యోధనా॥

(అనుబంధము 22.)

(నిష్క్రమింతురు.)

శ్రీ

# బృహన్నల నాటకము.

తురీయాఙ్కము.

ద్వితీయరంగము-ద్వారక.

[ప్ర॥ కృష్ణుఁడు-అభిమన్యుఁడు.]

అభి—మాతులా! నీకనుగ్రహములేకున్న నేనేమి చేయుదును? నా యుత్సాహభం చేసినందున నేమిఫలము.

కృష్ణ—అభిమన్యూ! ఊరడిల్లుము. ఇంకొక నెలదినములలో నీ తండ్రులు రా గదా నీ కేల యాతురము.

అభి—అజ్ఞాతవిధి తీఱినదినముననే యానందబాష్పములు నిండార మాతండ్రి షించుకొను నభిలాషముగదా నాకు? లోకగర్భుఁడవై నీ వెఱుఁగని రహ మున్నది. నీవు చెప్పకున్న నాగతికొలది నెంతైన వెదకెదను.

కృష్ణ—(ఆత్మగతము) ఈ కుమారుఁడు ననుమిగుల బాధించుచున్నాఁడు. వీనికి మాత్రమున నందేమి యుపాయము (ప్రకాశము) కుమారా! నేనెంతచెప్పి మానక మొఱకుదనమున బలవంత మొనర్చెదవు. రహస్యము మాత్రము వెలి తివా, మహోపాయము సుమా!

కం॥ పాపఁడవై మాణవక।
వ్యాపారము వెలయ నిట్టులడి గెదుగాదే।
యాపాటు వెలికిఁ దెలియమ।
హోపాయము గల్గునింత యారయ వేలా॥

అభి—మాతులా ! అట్లెన్నఁడైన నగునా ? తన్నుఁ జంపువిషము తానై కొని తెచ్చిన చందమగుఁగదా ?

కృష్ణ—అట్లైన క్షేమము. నేనింతమాత్రముఁ జెప్పెదను. నీవారందరు, విరాటపురమున, ప్రచ్ఛన్నత్వమున నున్నారు ఇక నీయిష్టము.

అభి. కం॥ సంతోషమాయెమాతుల ।
ఎంతయు ధన్యుండనైతినీయుపకారం ।
బెంతుఁగద నేనునిరతము ।
చింతింపకనాకుఁబోవ సెలవీవలయుఁ ॥

నేనుధన్యుఁడనైతిని. అందుపోయి వారినరసెద.

కృష్ణ—రథము నాయితముఁ జేయించెద. పోదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## తురీయాంకము.

## తృతీయరంగము-విరాటోద్యానము.

---

(మండపము—ప్రాపి.)

[ ప్ర॥ అభిమన్యుఁడు. (బ్రాహ్మణరూపమున.) ]

---

అభి—మా మేనమామయగు కృష్ణునితో పాండవులు విరటుపురి నున్నారని బలవంతపెట్టి యెఱిఁగి యిందువచ్చితి. ఆహా! రథమువిడిచి యొక క్రోశమయినను నడువ రాలేదె-ఇంతాయాసమగుచున్నది. నాతండ్రులింకెంతవస్థ నొందుచున్నారో. ఈ ఉద్యానము మనోహరముగానున్నది. రాజూరలేక వనభోజనమునకుఁబోయి యున్నట్టు తెలిసె. ఆ మండపమున నీరాత్రియంతయునుండి రేఁపు రాజదర్శనమునకుఁబోయెదను. ఆయాసమున నిద్రవచ్చుచున్నది. (పండుకొనును.)

[ప్ర॥ ఉత్తర-నీలా.]

ఉత్తర—నీలా! సాయంకాలమగుచు వచ్చెను. ఇంకను, ఎండబలిసియున్నది.

నీలా—చూచితివా-యీసరోవరమెంత రమణీయముగానున్నది. ఇందంత స్నానము సేయుదుమా?

ఉత్తర—మిగుల మేలు. అయిన మాఱుచీరలైనను లేవె. నీలా! పోయి తెత్తువా?

నీలా—మీవారున్నచోటు దూరమె. నీవొంటిగా నెట్లుండెదవు.

ఉత్తర—నాకేమి భయము. నీవు శీఘ్రముగఁ గొనిరమ్ము.

(నీల-నిష్క్రమించును.)

ఉత్తర—నీల వచ్చువఱకు నందున్న మండపమున విశ్రమింతును.

(పోయి, బ్రాహ్మణరూపముననున్న యభిమన్యునిజూచి.)

ఆహా ! ఏమహాత్ముఁ డీపురుషుఁడు. అనవరతాకాశగమ నాయాసమున ధరణీతలమునకు దిగివచ్చి సుఖశయనమునొందిన చండభానుఁడో ? ప్రణయయోగంబున రతీసతీ తిరస్కారముగాంచి తదావేశనా శాబద్ధుఁడై కోపమువగలునఁ బండియుండు మీనకేతనుఁడో ? స్వకాలసంజనిత సంభ్రమంబునఁ దనపరిణతియంతయుఁ దిలకించి మహానందమున మేనుమఱచియున్న వసంతుఁడో ? భూసతీసమాగమ కాంక్షచె నేతెంచి రతాంత తాంతుఁడైన మాధవుఁడో ? యగుఁగదా. కాకున్న నీతే జంపుఁబెంపు, ఈ రూపవైభవము, ఈ విలాస మనోహర్యత, యీ భోగ విభ్రమము నెందైననుండునె.

ఉ॥ ఈనిడువాలుచూపు వగయీనిటలార్ధహి మాంశువిభ్రమం ।
బీనగు మోము సోయగము నీ వెడదైనయురంబుపొంకమీ ।
మానిత బాహుదీర్ఘతయుమాయురెయీనవ మోహనాకృతుల్ ।
గానఁగదా తలంపనన కాముడో లేకయితండు సోముఁడో ॥

(అనుబంధము 23.)

అకటా ! రాజకంఠీరవుఁడగు విజయకుమారుఁపై నాకు వినుకలిచే నుత్పన్నమయిన. మోహానది యంతకంతకు నింకిపోవుచు వచ్చెఁగా ?

(ఒక పాముత్తరవెనుకనుండి రభసముగా వచ్చును. ఉత్తర తిరిగిచూచి హా ! యనియరచి మూర్ఛిల్లును. అభిమన్యుఁడు లేచిచూచి పామునుఁ చంపును.)

అభి—అకటా, ! ఈకాల సర్పమీయంగ నామణిఁ జంపుచుండెఁగదా ! ఈసతీమణి యెవ్వతయో. చంద్రునరయుచు ధరాతలమునకుఁ దిగిన రోహిణియో? వసిష్ఠుని వెదకుచువచ్చిన ·యరుంధతియో ? సాక్షాత్కరించి తరుణీరూపముపూనిన వనలక్ష్మియోయగుఁగదా ?

సీ॥ ఖండరూపములేక నిండురూపమె
యెల్లకడలఁ చందురునకుఁ గలిగెనేని ।
తాకితాకకమున్నె దాడి మీబీజముల్
విచ్చిపోవకకూడి వెలసెనేని ।
కాఠిన్యమును జేరి కామునీయుతగూడ
కనకకుంభములకుఁ గలిగెనేని ।

చలియించిపారని నిలుకడ గలకాంతి
చనుఘనాఘనముల కొనరె నేని ॥

అ॥ వె॥ యుప్పడించుకైన నగు నేమొయవి సాటి ।
కానియప్పుడెట్లు కలుగనేర్చుఁ ।
సుదతివదనమునకు రదనములకునీయు ।
రోజములకు నీశిరోజములకు ॥

నేనువచ్చినపని యేమి యిదియేమి. పోయెద (పోయివచ్చి) అక్కటా! తరుణీమణి రూపమునునయన కాంతశలాకవలె నా మనము సూదిప్రాయముగ నాటుకున్నది. దీని మందహాసదర్శనమే నాకనంతపదసౌఖ్యము. దీనికటాక్ష వీక్షణమే నాకమరలోకభోగము. దీని యాశ్లేషసౌఖ్యమే నాకు సర్వలోకసామ్రాజ్యము. ఇట్లుండ నీసతీమణిని బాసిపోవనేర్తునా? ఈ ఘోరవ్యాళముఁ గాంచి తనే యీమృగశాబనయన బెదరుగొంది మూర్ఛిల్లెను. దీనినుద్బోధింపక పోవుట కాదు (ఉత్తరయొద్దకువచ్చి) జలజాక్షీ! లెమ్ము భయపడకుము.

ఉత్తర—(లేచి భయమునభినయించి) ఆపామేమాయెను?

అభి—సుదతీ! నీవేణీభరమునందలి యీర్ష్యచేనది నిన్నుఁ జెనకరాగదానికి నాచే జావుఁగలిగె.

ఉత్తర—సాధురక్షణ వ్రతైకపర భూసుర గ్రామణీ. నేనీలోకమున నున్నానా
అభి—అతివా! నీవున్నట్లియడిగెదవా-నే నేలోకమున నుండుటయు నే నే యెఱుఁగన
ఉత్తర—(పామువైపునఁజూపి) ఆలోకమొకటి దక్క నేలోకము నెఱుఁగను.
అభి—తరుణీ! నీ యా లోకమొక్కటిఁ గలుగ నాకన్ని లోకములు గలుగును.

ఉత్తర—(స్వగతము) ఇపుడుధన్యనైతిని. అయ్యో! నే నేటికిట్లను కొనెదను? నాకీ డిధన్యత? (ప్రకాశము,) భూసురగ్రామణీ-!

అభి—ఏమియానతిమ్ము.

ఉత్తర—ఏమియులేదు.

అభి—ఏమియులేకూరక నన్నుపిలిచితివా. నిక్కముగా నాకేచిత్తచాంచల్యము గియున్నది. నీవు నాయెడనున్నానని యు నీనగుమోము చంద్రునెకసక్కె వచున్నదనియు నింతెఱుఁగుదు గాక వేఱొక్కటి యెఱుఁగను.

ఉత్తర—భూమీసురేశా! నే నేమి చేయుదును.

అభి—సంశయించక నీమదినినున్న యాశయము విశదపఱుపుము.

ఉత్తర—(ఊరకుండును.)

అభి—నీవు నన్ను మాటలాడించియు మాటలాడకునికిఁగారణము సంశయమో—భీతియో—లజ్జయో—నిరాదరణమో యయుండుఁగదా ?

ఉత్తర—నిరాదరణమెన్నఁటికిని గాదు.

అభి—అయినలజ్జాభీతి సంశయములా కారణములు. జలజాక్షీ ! యిక సందేహింపక, నాయొద్ద భేదమెంచకుము.

ఉత్తర—భూసురతిలకా ! నే నేమియు చెప్పఁజాలను. నాకు మనస్సులో దుఃఖముఁగలిగి యున్నది. ఆ దుఃఖము నింతయుఁ దాళను.

(అనుబంధము 24.)

అభి—తరుణీ ! నింకెంకెవ్వరి పైనైనను మనసుగలదో ?

ఉత్తర—(తలవంచుకొని) కాదనను.

అభి—ఆమోహనాంగుఁడెవ్వఁడు నాకింతఁ జెప్పుమా ? సర్వాశలు మానెదను !

ఉత్తర—భూదేవగ్రామణీ ! ఏలయోచింపనలయు. నాప్రాప్తియిట్లున్నది. వినుకలివలన నాకభిమన్యునిపై మనసుఁగలిగి యుండెను. నినుఁజూచిన నామది వాసె, మనఃకిల్బిషమూలమున నాపాతివ్రత్యమునకు, భంగము గలుగునట్లున్నది. నేనేమి సేయుదును. (దుఃఖించును.)

అభి—అబలా ! నీవు దుఃఖింపకుము నీవభిమన్యునే పెండ్లియాడునట్లును, నాకోరికలు ఫలించునట్లును, నీ పాతివ్రత్యమునకు హానిగలుగనట్లును, నేనొడఁగూర్పఁజాలుదు.

ఉత్తర—విప్రోత్తమా ! నీమాటయభేద్యార్థముగనున్నది.

అభి—నెలదినములలో దీనియర్థము తేటపడగలదు. నీవువిరాటుని పుత్రివిఁగావా ?

ఉత్తర—ఉత్తరయనుదానను. నీ వెందుండగలవు.

అభి—నీవీట నేనసింపువాఁడ.

[ప్రవేశము-ఉత్తరుఁడు.]

ఉత్తరుడు—ఉత్తరా ! ఇందేలయున్నావు ? పొమ్మింటికి. ఆహా భూసురా ! నీవేడరాజేంద్రకుమారియేడ ? అసంబద్ధప్రలాపములా ?

ఉత్తర—అన్నా ! ఉత్తరకుమారా ! ఈబ్రాహ్మణుఁడు నన్నుఁజావువలనఁదప్పించెను.

ఉత్తరుడు—తప్పించెను. తెప్పించెను. నీనవివేకినివి పొమ్మిక్కడనుండి.

ఉత్తర—అన్నా—

ఉత్తరుడు—అన్నా నున్నా-పోయదవాలేదా ?

ఉత్తర— (నిష్క్రమించును.)

ఉత్తరుడు—బ్రాహ్మణా! నీవేడబము లెక్కడ నేర్చితివి. రాజపుత్రికిని పేడగుబాపనికిని స్వర్గమునకు నరకమునకున్నంత దూరము. నీవు బ్రాహ్మణుడవు కాకుండిన, నీపీకు చీలుచుండెను.

అభి—అయ్యా మన్నింపుము.

ఉత్తరుడు—మన్నింపవలయునా ? నిన్నుఁదన్నింపవలయు. వెడలిపొమ్ము.

అభి—రాజకుమారా ! నేనివిరాటుని కొలువునందుండ వేడివచ్చియున్నాను.

ఉత్తరుడు—విరాటుని రాష్ట్రమున నిన్నుండనివ్వను. పోకున్న నీచెవులు కోయింతును.

అభి—అయ్యా—

ఉత్తరుడు—అయ్యా-కొయ్యా-నీకర్థచంద్ర ప్రయోగమగును.

అభి—భూమిశా—

ఉత్తరుడు—భూమిశా-రోమిశా - తొలగుము. (అనిచెయిపట్టి యీడ్వనభిమన్యుడు కదలఁడు) ఆహా ! నీకింతకావరమా ? ఇప్పుడు చూతువుగాక (మెడబట్టి త్రోయ అభిమన్యుడు కదలఁడు)

అభి—(ఉత్తరుని త్రోయును కింపపడితేచి నమస్కరించి చేతులు జోడించి) స్వామీ నీవు బ్రాహ్మణుఁడవు కావు మహాపురుషుఁడవు.

(అనుబంధము 25.)

నాకరాంగుళిమునలోకమునంతయుఁ గదిలింపజాలుశక్తి యుండెడిను. నాకు నీయెడనీరసమాయెను. నేనెఱిఁగినంతలో రుద్రుఁడు-కృష్ణుఁడు మీరియుండుటకు కలవారు. వారిశక్తినాయెదుటఁబనికిరాదు. జరాసంధుఁడు పదునెనిమిది మారులు కృష్ణుని జయించెను. అట్టిఁడును మామేనమామకీచకుఁడును సమబలులు. కీచకుండు నాకంటె మిక్కిలితక్కువ. (రహస్యమున) ఆ కీచకుఁజంపిన వాఁడ నేనె. రుద్రుండు ఎవఁడమా? యర్జునుఁడే వానిజయించెను. అర్జునుఁడు నన్నేమనుట నాకును ఆ బరమాత్మునికే యెఱుక. నీవెవ్వరో యెఱుంగను.

అభి—నేనుబడగుబాపడఁగాని వేఱుకాదు. నీమాటవలన నద్భుతము జనించె. అర్జునుఁడు నిన్నేమనును.

ఉత్తరుడు—అతఁడు కాలకేయని వాతకవచులఁ జంపినపుడు సారథియైనరెఱుంగుదువా ?

అభి—ఇంద్రసారథియగు మాతలి యనివిన్నాను.

ఉత్తరుడు—(నవ్వి) "లోగుట్టు పెరుమాళ్ళకెఱుక" రాక్షసులఁజూచి మాతలిపరుగెత్తిపోవ నన్నుఁబ్రార్థించి యర్జునుఁడు సారథిగాఁజేసికొని జయము నడపె. పేరునకు మాత్రము సారథిగాని నేనేమిగులయుద్ధమాడినది. అప్పుడర్జునుఁడు తన కంకణమె నన్నునయని సఖ్యముఁ చేసినాఁడు.

అభి—(స్వగతము) వీఁడసాధ్యుఁడుగానున్నాఁడు. ఎదురులేకున్నది. ఇంకెంతవఱకు వచ్చునో చూతము (ప్రకాశము) ఇపుడు గదా యర్జునుభంగి తెలిసె. కీచకుని నీవే చంపితినంటివే యెట్లు?

ఉత్తరుడు—మాయూరిలో నొక సైరంధ్రియున్నది. దానికి నాకుఁబరిచయము. పరిచయమన్న దెలిసికొనఁగలవుగదా? దానివాఁడు మోహించి నేను వలదన్నను విననందున రాత్రి సైరంధ్రివేషము వేసికొని నేనేవానిఁజంపితిని వానితమ్ముల నష్టేచేసితిని. నీపుణ్యమగు. నీవెవరి తోడనుననకుము నాప్రాణమునకు వచ్చును. "వీడు కృష్ణునికష్టము పుట్టినాఁడు మేనమామను జంపెను" అనియందురు. చూచితివా నీతో మాటలాడుచుండఁ జీకటియాయెను. మాతండ్రి నినుఁగొలువున నిలుపు కొనునట్లు చేసెదను. అతడిందే యున్నాఁడు పోదమురమ్ము.




అభి—నేను ఱేఁపు రాజుగారి కొలువునకు వచ్చెదను.

ఉత్తరుడు—కొలువేలకావలయు? ఇపుడేరమ్ము.

అభి—క్షమింపుము. ఇపుడువలదు.

ఉత్తరుడు—నే నలసియున్నాను. కొంచమట్లు పోయి మా సేవకుల వెలుతురు తెత్తునుము

అభి—నాకాయాసముగా నున్నది క్షమింపుము.

ఉత్తరుడు—ఇంతమాటవిననివాఁడవు నీవేమి కొలువుండెదవు. నీవు రాకున్న నిలుచునా-(పోయిచచ్చియున్న పామును ద్రొక్కి) అయ్యో! అయ్యో! చచ్చితి-చచ్చితి-(అని క్రిందఁబడును.)

(అనుబంధము 26.)

అభి—(వచ్చి) ఏమయినది? ఏమయినది?

ఉత్తరుడు—చచ్చితినయ్యా! మాతలిదండ్రులతోఁజెప్పుము.

అభి—నీకేమిప్రాప్తించినది.

ఉత్తరుడు—ఎంతపెద్దపామయ్యా! ఇరువది బారలుండవచ్చును. మృత్యుదేవతవలెకఱచి వెడలి పోయెను.

అభి—అదియా? భయపడకుము, అదిచచ్చినది. నీవూరక త్రొక్కినావు. ఇదియేకదా? (చూపును)

ఉత్తరు—నీపుణ్యమయ్యా! దగ్గరకుఁ దేకుము.

అభి—ఇది చచ్చినదయ్యా

ఉత్తరుడు—నాకుఁదెలియదయ్యా! నన్నుఁగఱచినపుడె త్రొక్కిచంపితిని

అభి—అటుకాదయ్యా! అదిచచ్చి నాల్గుగడియలైనది.

ఉత్తరు—అవునయ్యా?

అభి—అయిన అదెని న్నెట్లుకఱచును.

ఉత్తరుడు—అయ్యో! చచ్చినపాము కఱనదని యెవరు చెప్పిరయ్యా! శరీరము ...
క్కినఁజాలదా?

[ప్రవేశము: సేవకుఁడు - (దివ్వటీతో.)

సేవ—మాయుత్తరరాజుధ్వని విన్నట్లాయెను.

ఉత్తరుడు—అయ్యో! నేనేయప్పా! పాముగఱచి చచ్చియున్నాను

సేవక—(స్వ) చచ్చినవాఁడు మాటలాడుచున్నాఁడె.

(సేవకుఁడు—అభిమన్యులిరువురు ఉత్తరుని పిలుచుకొని పోవుదురు.—పో...
ఉత్తరుఁడు పామునుగొట్టును.)

(సేవక—ఉత్తరుఁడు నిష్క్ర.)

అభి—ఆహా! వీఁడెట్టిభీరుఁడు-ఉత్తరాసతీ! ఇట్టినిర్భాగ్యునికిని వెట్లు చెల్లెలైతివి. వీ...
అకై నీయందలి మోహముతగ్గునా? రుక్మిఁడును-రుక్మిణియు నొకరికొ జనింప...

(అనుబంధము 27.)

(నిష్క్రమించును.)

శ్రీ

# బృహన్నల నాటకము.

## తురీయాఙ్కము.

### చతుర్థరంగము - విరాటునిల్లు.

[ప్ర॥ కంక - వలల - బృహన్నల.]

బృహ—అయిననిదియే నిర్ధారణమా ?

కంక—విజయా ! ఇట్లు చేయకున్న విధిలేదు. నీకొడుకునూరడించుటకై నీకెంతో యభిలాషముండును. అయినను సమయముకాదు. ఎంతమనవాఁడైనను, తానెంత గుఱుతించినను దగదు.

బృహ—ఆహా! అగ్రజా ! నేఁడెట్టిమాటవింటిని. ఇంతటి దుష్కాల మెవ్వరికైన వచ్చునే! అయ్యో! తానైనను గుఱుతించుకోరిక చేవచ్చి నావలెదన కజ్ఞాతవిధిఁగలుగఁ జేసికొన్న ముద్దుకొడుకును జూచుచుండియు ముద్దాడఁగౌఁగిలింపఁదుదకు మాటాడనైనను లేకున్నదే ?

(అనుబంధము 28.)

కంక—నెలదినములలోనున్నదిగదా ? ఇంతకేలయోచింపవలె ? విజయా ! నీకుమాత్రమా. ధీరశేఖరుఁడగు సుతునిమాటాడింపఁగూడని దుస్థితిఁగలుగుట. దానిఁదలఁచుకొన్న నామానసమెట్లగలుచుంటయు జెప్పఁజాలను.

వలల—ఒకవేళ నభిమన్యుఁడు నీకాంతమున జేరునఁబిలిచిన నేమనవలయు.

కంక—ఇంకేమనవలయు ? (దుఃఖమున) నీవెవరనియడుగవలయు.

వలల—ఆహా ? తండ్రి బిడ్డలకె గవుచేసియున్నదిఁగదా ? ఈ కష్టవిధి.

కంక—ఏమిసేయుదము. ఎవరో మాటలాడుచున్న ధ్వనివినవచ్చె. ద్రౌపదికిని—గవలకు-నీసంకేతముచెప్పుఁడు.

(నిష్క్రమించుదురు)

# బృహన్నల నాటకము.

---

తురీయాఙ్కము:

పఞ్చమరంగము – విరాటునిల్లు.

---

[ప్ర॥ అభిమన్యుఁడు.]

---

అభి—నేనెవరికొఱకు ముఖ్యముగా వచ్చితినో! యతఁడే చిక్కడయ్యె. కంకభట్టుఁడే ధర్మతనూజుఁడు. వలలుఁడే భీమసేనుఁడు. దామగ్రంథి తంత్రిపాలు లశ్వినులు. సైరంధ్రియే ద్రౌపది. నేనువిచారించినవారు వీరితోడ బృహన్నలయును, వచ్చెనని చెప్పి ఆ బృహన్నల యర్జునుఁడగునా? ఇదివచ్చిన వేషముకాక, వేసికొన్న వేషము కాని ఇదెట్లువచ్చును. అతఁడు ధనంజయుఁడు కాఁజాలఁడు. కానేరఁడు. కాఁడు. మా పె తండ్రుల. నడిగి తెలిసికొందును.

[ప్ర॥ కంకుఁడు.]

అభి—పితృవ్యా! నమస్కారములు. (నమస్కరించును)

కంక(—మొగముచిన్న చేసికొని)పితృవ్యుఁడెవ్వఁడు—నీ వెవరవు. నిన్నుఁబిచ్చిపట్టి యున్నాదో? ఆవలబొమ్ము. (అనిపోవుచు-అహా! దుఃఖముననిష్క్రమి)

[ప్ర॥ వలల.]

అభి—పితృవ్యా? నమస్కారము (నమస్కరించును.)

వలల—నీ వెవఁడవా వలబొమ్ము (పోఁబోగా)

అభి—(చేపట్టి) పెద్దతండ్రీ- ధర్మతనయునొద్ద నాకుమిక్కిలిచనవు లేమిఁజేసి పెద్ద నగఁజాలనైతిని నిను విడువను. మఱిమియువలదు. మాతండ్రియునరింత చెప్పవలె నవ్వఁజాలును?

వలల—(దుఃఖమున)చేయి విడిపించుకొని వెడలిపోవుచు.
(“హా! శ్రీహరి” నిష్క్రమించను)

అభి—వీ రేమి చేయుదురు. వీరి విధి తమకొడుకునగు నన్నుఁ గొడుకని చెప్పఁగూడకుండఁ జేసినదిగా?

(అనుబంధము 29.)

(నిష్క్రమి.)

శ్రీ

# బృహన్నల నాటకము.

---

## తురీయాఙ్కము.

### షష్టమరంగము-ఉత్తరునిల్లు.

---

[ప్రవేశము-ఉత్తరుఁడు-ఉత్తర-నీల.]

---

ఉత్తరుఁడు—మాతండ్రి కేమిపిచ్చి. ఒకసుశర్మతో యుద్ధమునకుఁబోవుటకు. నాఙ్గురుతమ్ములుతాను చాలక, పంచాంగమువాఁడు—వంటలవాఁడు.—గుఱ్ఱాలావులుఁ కాచువారు. ఇంతేను కావలయునా? నన్నొకనిఁబంపి యుండరాదా?

ఉత్తర—అన్నా! పంచాంగము వాఁడేమి. వంటలవాఁడేమి.

ఉత్తరుఁడు—ఉండ లేదా మనకంకభట్టయు వలలుడువీండ్రీనాఁడు పురుషధీరులైనారఁట?

ఉత్తర—అన్నా! వలలుఁడు సామాన్యుఁడు కాఁడు పులులతో సింగములతో.—

ఉత్తరు—నాకేమియు లక్ష్యములేదు. వానితో మల్లయుద్ధము చేయవలయునని నాకంతో యభిలాషము. అయిన వంటలవాఁడౌటచే.—

(ప్రవేశము-సేవకుఁడు.)

సేవ—రాజేంద్రా! విజయోస్తు. ఉత్తరదిక్కునను మన గోపాలురు మహారోదనముచేయుచువచ్చిరి. కౌరవరాజబలగమంతయు ధార్తరాష్ట్ర గురుకృపాశ్వత్థామకర్ణులు మన గోధనముల్నిగ్రహించి తరమికొని పోవుచున్నారఁట.

ఉత్తరుఁడు—(కోపమున) ఛీ! ఏమంటివి? మనగోపాలురు వానిజయించలేకపోయిరా? వారినీక్షణమునఁగొలువునుండి తప్పించి యున్నానని చెప్పుము. రణభేరివేయించుము,

సేవ—భాగ్యము. (నిష్క్రమించును.)

ఉత్తరుఁడు—నీలా! ఉత్తరా! నాప్రతాపము చూపుటకు సమయము దొరికె,

నీల—రాజేంద్రా! నీవొక్కఁడవే.— అసహాయుఁడవే.— వారు పెక్కండ్రే-అతి థమహారథులే.

ఉత్తరుడు—(నవ్వి) ఈతుచ్ఛకౌరవుల కిస్తులు కాఁబోయెదరా? మిడుతలగ్నినపలె చందమున వారుసాహసించిరిగదా? నా ప్రతాపమార్తాండునకు వారిని ముందు కొం లఁజేసి బాణానలమున నీరుగావించెదను.

(అనుబంధము 30.)

శరీరమునందంతటను రోమాంచము గలిగించి కాలునిలుప నీకనాతో పాగ్ని నను వణఁకించుచున్నది చూచితిరా? సేనకా రథమునిప్పుడే యాయిత్తము సేయింపుడు ఆహా! మఱచితి సారథియెవరు?

నీల—నీకున్న సారథి యేమాయెను?

ఉత్తరుడు—నాకుసారథి యెక్కడనున్నాఁడు? నేను యుద్ధమాడువేళకలుగ నేలేదు. పణుని మూలబలము పోలే నన్ను మావారొక్కస్థగా నన్నువలికి రానీకున్నారు అయ్యో! సారథిమాత్రము దొరికెనా.—

ఉత్తర—అన్నా! మనబృహన్నలకు సారథ్యమునందు, పాండిత్యము గలదనియు, న సతోఁ జేరి ఖాండవదహనమున గెలుపుఁగలుగఁ జేసెననియు, సైరంధ్రి నాతోఁ జెప్ చుండెను.

ఉత్తరుడు—వైళముపోయి బృహన్నలం దోడికొనిరమ్ము.

[ఉత్తర-నిష్క్రమించును.]

ఉత్తరుడు—నీలా! నీకు యుద్ధముచూచు నభిలాషము కలదా?
నీల—ఉండిన—
ఉత్తరుడు—పిలుచుకొని పోయెదను.
నీల—అయ్యో! యుద్ధమే. ఏబాణముతగిలినను బ్రాణాపాయమే.

ఉత్తరుడు—అందుకేమిమ్ము నబలాజనమనునది. నీకొకబాణముదాఁకనిచ్చిననే నో రథికుఁడనా? కావలయునన్న నీతోనె యుద్ధమాడించి కురురాజ నరకాసురునికి నుసత్యభామఁగాఁ జేయుదురమ్మ.

(ప్రవేశము-బృహన్నల-ఉత్తర.)

బృహన్నలా! రమ్మ-నీవునాకు సారథ్య మొనరింపఁదగియున్నది. కౌరవబిడా ములు యుద్ధమునకు వచ్చినవఁట. ఖాండవదహనమున నీవర్జునునకు సారథ్యమొనరి

చితివంటి నాకును నయజ్ఞునకును గల తారతమ్యము నీవేయరయుదువు. మద్బాణాగ్నిచే నేనీకౌరవఖాండవము దహించి విజయత్వము పొందఁదగియున్నది.

బృహ——యువరాజా! నేనంతకుఁజాలుదునా!

పృథ్వీవృత్తము॥ మహాబలగరిష్ఠులామ గలుకౌరవుల్వెండియుఁ!
సహాయబల గర్వితుల్సరకు సైయరాదు ద్రునిఁ!
అహీనగతి వారినేఁడని వధింపనీవేగగా!
నహహా తెలిసి యెట్టులేనగుదు సారథిఁ భూవరా॥

మహా బలిష్ఠులగు కౌరవుల యుద్ధమున నేనుసారథిఁగాఁదగుదునా?

ఉత్తరుడు——నీవు భయపడకుము. ఉత్తరరాజు కేసరికిశోర ప్రవీణతకౌరవ కరియూధములపై వెలయుందునపుడుఁగదా, నీవెఱుఁగఁ గలవు? కవచము వేసికొనుము.

బృహ——(వేసికొనలేదు)

ఉత్తరుడు——(నవ్వి) మంచి సారథివి (కవచమువేసి) నీవూరక పేరునకు మాత్రముండుము. నే రథినై, సారథి నయ్యెద.

ఉత్తర——అన్నా! నీవు కౌరవవీరుల జయింతువుగదా? నాబొమ్మ పొత్తికలకుఁగొన్ని యంబరములుఁ దెత్తువా?

(అనుబంధము 31.)

ఉత్తరుడు——చెలియా! కావలసినన్ని తెత్తును. నీవునుదోడు వచ్చిన రమ్ము.

ఉత్తర——నేను రాఁజాలను.

ఉత్తరుడు——నీకుభాగ్యము లేదు. ఎటికీ స్త్రీలు యుద్ధమన్న నిట్లు భయఁపడెదరు.

ఉత్తర——బృహన్నలా! నీవు మాయన్నకు జ్ఞాపకము చేయుదువా?

బృహ——కుమారీ! ఏలయోచింతువు. అవశ్యము చేయుదును.

ఉత్తరుడు——బహన్నలా! ఈయాడువాండ్ర మాటలు వినుచున్న మనపని యెట్లుజరుగనలయు. అయినను నేననికివత్తునను వార్తతెలిసిన వెంటనే, కౌరవులు పలాయితులై పోవుదురు-పోవుదముర మ్ము.

(నిష్క్రమింతురు.)

తురీయాజ్ఞ్యము సమాప్తము.

శ్రీ

# బృహన్నల నాటకము.

---

పఞ్చమాఙ్కము-ప్రథమరంగము. (అడవి)

[ప్రవేశము అభిమన్యుఁడు.]

---

(అనుబంధము. 32.)

అభి—అహో ! ఏమి చోద్యము - బృహన్నల సారథ్యమున నుత్తరుఁడు కౌరవుల నో డెలెదునఁట. నాకోరిక ఫలించునట్లున్నది. ఇదివఱకే బృహన్నలను, నేను మా నా ప్పుఁడంతయు నతఁడు నామోము దేఁరిచూచి నిశ్చయింప కుండుటవలన, నాకు సం దేహముకలిగె. నేఁటియుద్ధము నిజమాయనా ? బృహన్నలయే మాతండ్రియగు. నే మ రుగున నుండియరయుచుందును.

(మఱుగున నిష్క్ర.)

[ప్ర॥ రథముపైఁఉత్తరుఁడు-అర్జునుఁడు.]

ఉత్తరు—బృహన్నలా ! రథమింతనిలుపుము. మనవూరు విడిచియెంత దూరము వ యున్నాము ?

బృహ—ఏదీపాదక్రోశమయినను రాలేదే. ఇదియే యూరు.

ఉత్తరు—అక్కడకనుపించు తోటలలోఁబోయియుందము.

బృహ—ఉండి ?

ఉత్తరు—రేఁపుయుద్ధమాడుదము.

బృహ—గోధనము మనకుఁజిక్కునా ?

ఉత్తరు—చిక్కకున్న నూరు చేరుదము.

బృహ—ఇక్కడికి వచ్చిన పనియేమి ?

ఉత్తరు—నీకీయధికప్రసంగమెందుకు ?

బృహ—నీకేమిభీతిగలిగెనా ?

ఉత్తర—భీతి! ఈతుచ్ఛకౌరవులకు భీతికావలయునా! వారిలోమొగవాఁడెవ్వఁడు చెప్పుము.

బృహ—శూరుఁడవన్న నీవుగదా?

ఉత్తర—అందుకుఁగాదు. నాకేమోయపశకునములవుచున్నవి.

బృహ—అపశకునము లెక్కడివి. ఇంతటి సచ్ఛకునము లెన్నఁడైన నాయెనే.

ఉత్తర—నావామనేత్రమదిరినది. చూచితివా? నావామ భుజముచలించినది చూచితివా?

బృహ—భయము గలిగిన నవి చలించును.

ఉత్తర—ఇంకొక్కసారి భయమన్న నీయొడలు నీవికావు. పోనిమ్ము. రథము.

బృహ—భాగ్యము.

ఉత్తర—(కొంతదూరము పోయి) బృహన్నలా! దాహమగుచున్నది. దాటివచ్చిన బావికిపోపుము.

బృహ—రాజేంద్రా! ఎంతయుద్ధమాడఁదగియున్నది! ఇప్పుడే యిట్లునోరెండిన నెట్లుఁ ఊరకపోపుము.

ఉత్తర—(కొంతదూరము పోయి) బృహన్నలా!

బృహ—రాజకుమారా! ఏమి.

ఉత్తర—(యోచించి) అదియేమిటిది.

బృహ—మఱ్ఱిచెట్టుగదా?

ఉత్తర—మఱ్ఱిచెట్టా—యట్లున్నది చూడు.

బృహ—ఊరక మాటలాడిన జాగగును. పోవుదము.

ఉత్తర—(కొంతదూరముపోయి) బృహన్నలా!

బృహ—ఏమి? (అని కసరును.)

ఉత్తర—అశ్లీలపలించెదవు? అది యేమి?

బృహ—ఆమి—అవిసెకూర.

ఉత్తర—(స్వగతము) నాకు పిఱేఁడదాపురమాయెను? (కొంతదూరము పోయి) బృహన్నలా!

బృహ—ఏమి? (కసరును.)

ఉత్తర—అయ్యో! నినుఁబిలిచితినా?

బృహ—పిలువకున్నఁ బోనిమ్ము.

ఉత్తర—(కొంతదూరముపోయి) బృహన్నలా! బృహన్నలా! బృహన్నలా! బృహన్నలా! బృహన్నలా! బృహన్నలా! (వింటికొోపునబొడిచి) బృహన్నలా! అదియేమి. నేల యీనినరీతిగా మనుష్యులు పుట్టపగిలియున్నదే?

బృహ—ధరణీశకుమారా! అదియే కౌరవసైన్యము.
ఉత్తరు—కౌరవసైన్యమా! ఏమి రథములు. ఏమిధ్వజములు. ఏమిగుఱ్ఱములు. ఏ పతాకములు. ఏమి ధనువులు. ఏమిరథికులు. నాచేతంగాదు. మనమూరకపోదవ

బృహ—రాజకుమారా! బాణప్రయోగములు తదుపసంహారణములు ధనుష్టంకృతుం ఏవియువినకనే భీతిల్లెదవా?

(లోపల సైనికుల కలకలము.)

ఉత్తరు—అయ్యో అయ్యో! నేఁజాలను జాలను—ఊరకూరుచేర్పుము.
బృహ—ఉత్తరకుమారా! యువతీజనమునుండి కౌరవులనుక్కడంచి గోవులదె నంటివి. చెలియలికి బొమ్మ పొత్తికలిత్తునంటివి.

ఉత్తరు—కౌరవులు సౌఖ్యమున నూరుచేరని. గోవులుపోయినఁ ద్రోవపోని. యలేఁటబడని. బొమ్మపొత్తికలుమండని. ఒల్లనొల్లను. అయ్యో! బృహన్న మాటలాడుచుండగనే రథము నడుపుచున్నావే.

(అనుబంధము 33.)

బృహ—రాజపుత్రా! వెనుకకుఁబోవ నాచేతఁగాదు. నన్ను సారథిఁగ నేలగైకొంటి

ఉత్తరు—బుద్ధినేరకచేసితినప్పా-తప్పైనదప్పా-నన్నుఁ బురినివిడిచి నీయిష్టము వచ్చి తయుద్ధమాడుము.

బృహ—కుమారా! ఇది క్షత్రధర్మమా! మీఱితియుద్ధమునఁ జచ్చినను వీరస్వర్గమగుగా

చ॥ శరనిచయంబులకా రిపుల సారముఁ బాపి జయింపకిట్లుసం।
గరమున కోహటించి వెనుకకా బడిపాఱెదె భీరుభంగిదు ॥
స్తరమిటు లాచరించి ననుక్షత్రియధర్మమె కీర్తిదక్కనే ।
మరణమునొంద నేమివినుమాసమకూరెడు నాకభోగముం॥

ఉత్తరు—చచ్చిననూ! అక్కెలందువు-నాప్రాణములు నాకేమి భారములా? బృహన్నలా! ఏమిట్లు పోనిచ్చెదవు. అయ్యో! అయ్యో! (అని రథము వెనుకను దుమికి ముంజతికేవచ్చి.)

(అనుబంధము 34.)

బృహ—(వెనుక దిరిగిచూచి వెంటపరుగెత్తును) (మూడుమారులు రంగమున యు వురుఁ బరుగెత్తుదురు.)

[ప్ర॥ బృహన్నల-ఉత్తరునిఁ బట్టుకొనును.]

ఉత్తరు——అయ్యో! బృహన్నలా! నమస్కరింతును. నీకుఁబది గ్రామములు వెయ్యావులు, ఏనూరుగుఱ్ఱములు, నూఱేనుగులు బహుమతి యిప్పింతును. ప్రాణముల మోసికొని వచ్చినఁ గౌఁగిలించి యాదరింపనున్న, మాతలిదండ్రులకు నాభార్యకు నాశాభంగము చేయకుమా?

(అనుబంధము 35.)

మృత్యువును పేరంటముపిలిచినట్టు నిన్నేలపిలచితి. నాకు జీవదానమిమ్మా? ఇంటనైనఁ బ్రాణములు విడిచెదఁగాక, యుద్ధమున విడువఁజాలను.

బృహ——రాజకుమారా!

సీ॥ కాలానుచరరీతి వేలార్చుభటులబల్
కోలాహలములకు డీలుపడక।
శంకార హితవీర హుంకారబహుధను
ష్టంకారమును వంకజంకుగనక।
కదనామితబలసంపద నారఁగాంచిన
మదనారసమితికి గడలఁబడక।
భుజసార నిహతసామజ సామ్యమునఁబొంగి
నిజసాయకములే యునియతివిడక॥

తే॥ గీ॥ భూరిసంగ్రామ సీమదుర్వారవైరి।
వీరవిదళన మొనరింప నేరకున్నఁ।
గీర్తిగల్గునె యేలయీయార్తినీకు।
నేను నీదండనుండనీకేమి భయము॥

నేనుండఁగా నీకేమిభయము-క్షణమునఁ గౌరవసేన నుఱుమాడుదునమ్మా.

ఉత్తర——పొమ్మా-నేను వఱదనను.

(అనుబంధము. 36.)

కొంచెము విడువుము రహస్యమునకుఁ బోవలయును.

బృహ——నాకు సారథి కావలదా?

ఉత్తర—నీవేసారథి—నీవేరథివి. నీవే భూతమువు-నీవే భవ్యమువు అన్నియు నీవేయై యమునింటికి బోవరాదా ? తోడులేక చావననుచున్నావే ?

బృహ—కుమారా! నీవేమన్నను విడువను.

ఉత్తర—గ్రహచారమా! నేనేపాపముఖముఁ జూచితిని. భూదేవీ! పర్వత సముద్రాదుల మోసికొనియున్న నీకు నేనొక్కఁడను భారమా! జనకా! విరాట! తల్లీ సుధేష్ణాదేవీ! నేను మిమ్మెట్లుచూతును.

(అనుబంధము 37.)

బృహ—ఏమీపనిచేత వైరాటీ!

ఉత్తర—అయ్యో! నీసారథ్యము వారధిపాలుగాను! నీసౌరత్వము మండిపోను— విధవను నీవుకొడుకవై జన్మించితివో ? అయ్యో! అమ్మా! (ఏడ్చును.)

బృహ—ఉత్తరా!

ఉత్తర—అయ్యో! రాజేంద్రా యంటివి. రాజకుమారా యంటివి. యువరా యంటివి-వైరాటీయంటివి. ఇపుడుమారకుత్తరాయంటివి. ఏమైననను. [illegible] పుత్రాఘమాయనుము. నోటికి వచ్చినట్లుతిట్టుము. ఇష్టము వచ్చినంత కొట్టుము. నను మాత్రము విడిచిపెట్టుమా?

బృహ—నీతోనింక మంచిమాటలు పనికిరావు ?

కం॥ విడనిన్ను నెక్కుమరథము ।
తడసిననిఁక నీడ్చువాఁడ దాక్షిణ్యములే ।
పోడలోపము నీడిగిలం ।
బదుక్రోవ్విన హాయముమంచి మాటలఁవినునె ॥

(ఈడ్చుకొనిపోయి నొగలపైఁ బెట్టును) అశమీ వృక్షమున్నయెడకు రథము తోలును.

ఉత్తర—(ఏడ్చుచుండోలును.)

(నిష్క్రమింతురు.

[పునః ప్రవేశము. ఉత్తరుఁడు-బృహన్నల.]

ఉత్తర—అయ్యో! ఈపీనుగునెట్లు తాకుదును ?

బృహ—జనములు ముట్టకుండుటకై శవాకారముగాఁగట్టిన శస్త్రాస్త్ర సంచి. కాని, యితరముకాదు. శవమైన నిన్నిపనికిఁ బెట్టుదునా ?

ఉత్తర—(వృక్షమునెక్కి) సారథీ! ఘోరసర్పములే, పెనుమంటలే, ఒకక్షణమున నీకత్తితోఁ జేయుపని కింతదూరము పిలుచుకొని రావలయునా?

బృహ—కుమారా! భయపడకుము. శ్లో॥ "అర్జునః ఫల్గునః పార్థఃకిరీటీ శ్వేతవాహనః, భీభత్సుర్విజయః కృష్ణః సవ్యసాచీధనంజయః" అను నీ మంత్రము మూడుమార్లు పఠించి అక్కడనున్న ధనువుందీసికొనిరమ్ము.

ఉత్తర—(తెచ్చి) నీచరిత్రము చోద్యముగానున్నది. అర్జునుపేరు చెప్పినంతనె, యివి సౌమ్యాకారము ధరింపకారణమేమి? యివి యెవరివి?

బృహ—కుమారా! ఇదియర్జును గాండీవము. నల్లనిదియై బంగారుపెద్దలు చెక్కిన చాపము యుధిష్ఠిరునది. తాటిచెట్టునలె నన్నతమై, బంగారు శాఖలుచెక్కిన బాణాసనము భీమునిది. రక్తవర్ణముకలిగి బంగారు చేపలుచెక్కిన కార్ముకము నకులునిది. నిగనిగ మెఱయుచు-బంగారునెమళ్లుతీర్చిన ధనువు సహదేవునిది.

ఉత్తర—ఇదియేమిటిది పర్వతము?

బృహ—భీముని గదాదండము.

ఉత్తర—ఇవిఅన్నియు నీకెట్లుతెలిసె?

బృహ—నేను తెలియదగినవాఁడఁగనుక తెలిసితిని.

ఉత్తర—ఆ పాండవులెందున్నారు?

బృహ—మన వీఁటనేయున్నారు.

ఉత్తర—మనవీఁటనా? ఎవరువారు.

బృహ—రాజకుమారా!

కం॥ మాలినిద్రౌపదికంకుం।
డాలరిధర్మజుఁడు వలలుఁడగు భీముఁడుగో।
పాలుఁడు సహదేవుఁడు హయ।
పాలుడు నకులుండు మనుజ పాలకతనయా॥

కంకుఁడె ధర్మరాజు-వలలుఁడే భీముఁడు. దామగ్రంధి తంత్రీపాలురేకవలు. సైరంధ్రియే ద్రౌపది దానికైకాదె గంధర్వనామమున భీముఁడు కీచకులం జంపెను.

ఉత్తర—భీముఁడెవరు?

బృహ—వలలుఁడే భీముఁడంటివే.

ఉత్తరు—వలలుఁడర్జునుఁడంటివి-నీవు మఱచినావు-జ్ఞాపకము చేసికొనుము.

బృహ—కాదు వాఁడు భీముఁడు.

ఉత్తరు—ఇంకర్జునుఁడెవరు.

బృహ—చూపెద నిటురమ్ము. (కొంతదూరముపోయి.)

(అనుబంధము 34.)

[బృహన్నలకు రూపముమాఱి క్రమముగఁ గిరీటము-శంఖము-కవచము-కేతనముఁ గల్గును.]

ప్రవేశము-అభిమన్యుఁడు. (శీఘ్రమున.)

అభి—(బృహన్నలనుఁ గౌగిలించి.)

(అనుబంధము 35.)

అర్జు—తనయా! అభిమన్యుకుమారా! నెలదినములనుండి యీపీటనున్నను, నిన్నొకమాటు లాడింపకుండ నిన్నాశ్లేషింపకుండఁ జేసెఁగా నావిధి.

(అనుబంధము 36.)

అభి—తండ్రీ! నీ వేమిచేయుదువు? నీయజ్ఞాతవిధి తీరినవెంటనే నిన్నాశ్లేషింపనెంచిన నాకు నేఁడాశాపరిపూర్తియయినదే పదివేలు. నా పెద్దతండ్రులు పినతండ్రులు మాఱువేషముల ధరించిరిగాక, వారిచాడ్పునలేక నీకీతెఱఁగెట్లు వాటిల్లె.

అర్జు—కుమారా! ఇది ఊర్వశి శాపమున నింద్రుని ననుగ్రహమునఁ గలిగిన వేషము. నీతో మాటలాడు వేళఁగాదు వైరివర్గము మఱిమించి పసినాక్రమించె. కదుపు బెట్టింపవలయు.

అభి—నేను బాణాసనము సిద్ధపరచియున్నాను. నీకు శ్రమయేల నేనుపోయివత్తును.

అర్జు—కుమారా! నీవంతకుఁ జాలుదువు.

[ప్రవేశము-సేవకఁ వేగమున.]

సేవక—ఉత్తరరాజేంద్రా! కౌరవసైన్యము రథికులతో నేతెంచి పట్టణమంతయు గల గుండు వెట్టుచున్నది.

అర్జు—తనయా! ఇది యా కురురాజు దుర్యత్నము. పొమ్ము నీవు పేటికి అస్త్రమ్ము నుఱుమాడుము.

అభి—(సేవకునితో నిష్క్రమించును.)

ఉత్తరు—(స్వగతము) ఏమిచోద్యము! ఇతఁడర్జునుఁడా? ఈ బృహన్నలుఁడర్జునుఁడా? ఆహా! ఇతనితో నేనేమేమో మాటలాడితినే—(ప్రణతిఁ జేయఁబోవును.)

అర్జు—(ఉత్తరుని లేవనెత్తి) కుమారా! నేనన్యుఁడఁగాను.

ఉత్తరు—విజయా! నేఁడెట్టి సుదినము.

(అనుబంధము 37.)

మహాత్మా! చిరకాలమునుండి నాకొక్క యభిలాషము కలదు. నేఁడది నేఁడు నీకెట్లుఁగలిగినవి.

అర్జు—కుమారా! తడవయ్యెడు. శత్రువులపైని తొలుత నేమిచేయవలెనో నాచేతఁ జెప్పికొందును. సారథికమ్ము లెమ్ము.

ఉత్తరు—(నొగలపై కూర్చుండును.)

అర్జు—(శంఖధ్వనిఁ జేయును.)

ఉత్తరు—హా! (యని మూర్ఛిల్లును.)

అర్జు—(ఉత్తరుని లేవనెత్తి-)కుమారా? శంఖారావమెట్టిదను వినవో.

ఉత్తరు—ఇదేమి-శంఖము-పిడుగుపాటునఁ గలుగునట్టు మహోగ్రఁగదా!

అర్జు—కుమారా! ఇంకఁబోవనిమ్ము.

(నిష్క్రమింతురు.)

(వెనుకయవనిక నెత్తగా.)

ప్రవేశము. భీష్మ-ద్రోణ-కృప-అశ్వత్థామ-దుర్యోధన-కర్ణ-దుశ్శాసన.

ద్రోణ—(భీష్మునితో నేకాంతమాడి) ఔరా! విదర్జునుఁడెగుటకు సందేహమేమి? పదమూఁడు సంవత్సరములు బాణప్రేషణతుష్టియెఱుంగక, మాఁచిపట్టి వెలికిరుండి వెలువడివచ్చు మార్తాండు చందమున, మాఁదియూడిన వెలుఁగు జాతవేదుని చందముఁ గొందుచు నధిక తేజోవిఖ్యాతుఁడై, అజాళిపైవచ్చు శార్దూలము కరణి, కుంజరయూథములపైఁ బాఱుతెంచు సింహశాబము కరణివచ్చువాఁడర్జునుఁడే. వానితోఁ బోరాడుట సమయముగాదు. ఊరక పనిమానిపోదము.